శ్రీ రస్తు

శ్రీ మహాభారత భీష్మపర్వాంతర్గత

# శ్రీ భగవద్గీతాశాస్త్రము

## తెనుగు పద్యకావ్యము

శ్రీ శ్రీ వేంకటగిరిసంస్థానాధిపతులు

శ్రీ శ్రీ కుమారయాచమనాయనివారియాజ్ఞఁజొప్పున

శ్రీ గోపీనాథము వేంకటకవీశ్వరులచేఁ దెనిఁగింపఁబడినది



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

 [Price. Rs 1—4—0.

# పీఠిక

భారతీయవాఙ్మయమునకేగాక ప్రపంచవాఙ్మయమునకు మకుటప్రాయమైన భగవద్గీతల, "భగవద్గీతాశాస్త్రము" అనుపేర తెనుఁగునఁ బద్యకావ్యముగ రచియించిన శ్రీగోపీనాథ వేంకటకవి, అధునాతనాంధ్రవిద్వత్కవులలో నగ్రగణ్యుఁడు. ఈతఁడు నెల్లూరుజిల్లా కావలితాలూకా లక్ష్మీపురగ్రామమున క్రీ. శ॥ 1820 ప్రాంతమున జన్మించెను. తన పదునాఱవయేట శ్రీవేదాద్రినరసింహుని యుత్సవము జూచుటకు నేఁగి యచ్చట నొకయోగివలన మంత్రోపదేశమును బొంది సాహిత్యవిద్యనార్జించి యనర్గళకవితాధోరణితో బహు మహాగ్రంథములు రచియించి క్రీ. శ॥ 1895 ప్రాంతమునఁ గీర్తిశేషుఁడయ్యెను. ఈతఁడు శ్రీమద్వాల్మీకి రామాయణమును తెనుఁగున యథామాతృకముగ నాంధ్రీకరించుట విని, అప్పటి వేంకటగిరిప్రభువును భాషాపోషకుఁడును విద్వత్పక్షపాతియు నగు శ్రీ వెలుగోటి సర్వజ్ఞకుమార శ్రీ యాచమనాయనింవారు (క్రీ. శ॥ 1831-1892) దానిని క్రీ. శ॥ 1859 సంవత్సరమున పూర్తిచేయించి ముద్రించి వ్యాప్తిలోనికిఁ దెచ్చుటయేగాక, క్రీ. శ॥ 1860 లో ననగా శాలివాహన శకవర్షములు 1732, సిద్ధార్థినామసంవత్సర శ్రావణ శుద్ధపౌర్ణమినాఁడు మాచేర్ల సీమలోచేరిన "పెదసుపల్లి" అను గ్రామమును బహుమతిగానొసంగి దానపత్రమువ్రాయించి యిచ్చిరి. ఈ రామాయణమునకే గోపీనాథరామాయణ మని పేరు. ఇందులో కవి మూలము ననుసరించుటయేగాక వ్యాఖ్యానములయందలి మనోహర భావములనుగూడ వ్యక్తపఱచి, మృదుమధురశైలిలో రచియించియున్నాఁడు. నెల్లూరిమండలమునఁ బుట్టిన యీ రామాయణము నేఁటికిని యుత్తరాంధ్రప్రాంతములలోఁ బురాణముఁ జదువుదురన్నచో నీ గ్రంథవ్యాప్తి విశదమగును.

ఈ రామాయణమైనవెనుక నీ భగవద్గీతాశాస్త్రమును బ్రహ్మకైవర్త పురాణమునందలి కృష్ణజన్మఖండమును నీకవి యాంధ్రీకరించెను. ఈ రెండవ గ్రంథము నించుమించు రామాయణమంత గ్రంథము. దీనినే తరువాత క్రీ॥ శ॥ 1889లో సర్వజ్ఞకుమార శ్రీ యాచమనాయనివారి పుత్రులగు శ్రీ రాజగోపాల కృష్ణయాచేంద్రులవారు ముద్రించిరి. వేంకటకవిగారి కృతుల వెనుక, సంస్కృత పంచకావ్యములలో మిక్కిలి క్లిష్టమైనదియు "మాఘే మేఘేగతం వయః" అని మల్లినాథసూరిచే ననిపించినదియునగు మాఘ కావ్యము (శిశుపాలవధ)ను తెనిగించిరి. తెనుగులో మాఘకావ్య భాషాంతరము వేంకటకవిగారికి ముందు పోచిరాజు వీరన్నయను కవి రచించినదిమాత్రము కలదు. తొలిదాని నొకమారు శ్రీవారు ముద్రించిరి. ఇప్పుడు ప్రతులులేవు. వేంకటకవిగారు దీని సులభగ్రాహ్యముగు నట్లనువదించియున్నారు. ఇది మదరాసు విశ్వవిద్యాలయములో నొకతూరి పాఠ్యగ్రంథమైనది. భగవద్గీతను, ఈ గ్రంథమును, నైరాజుగారే ముద్రింపజేసి గ్రంథవ్యాప్తికితోడ్పడిరి. విశ్వవిద్యాలయములోఁ బఠనీయగ్రంథమైనప్పుడీ గ్రంథమును నుచితముగ విద్యార్థులకందఱకు నిచ్చునట్లుగ ఆరాజుగారేర్పాటుగావించిరట.

ఈ రచనలవెనుక, కళాశాస్త్రమునకు సంబంధించిన "బ్రహ్మానంద శతకము" అనునొక శతకమును రచియించెను. ఇది కొక్కోక, రతిరహస్యాది గ్రంథములలోనున్న విశేషములన్నియు, సీసపద్యములలో పొందుపఱుపబడియున్నవి. వేంకటకవిగారి చివరకృతి రాధికాపరిణయము. ఇది కవిగారి తొలిపోషకులగు శ్రీ సర్వజ్ఞ కుమార యాచేంద్రులవారి బావమఱఁదియు, తెరువూరు జమీందారులునగు శ్రీ వెల్లంకి సూర్యారాయనివారి కంకితము. ఇది "రత్నాకరము" అనుపత్రికయందు ప్రకటింపబడినది.

శ్రీ వేంకటకవిగారు వేంకటగిరిరాజులచే నఖండసన్మానములను బొందిన వారైనను వారు శ్రీ వావిళ్ల సంస్థకుఁజెందిన కవులని చెప్పనగును. తొలుత వీరి వాల్మీకిరామాయణమును, శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారే, రాజాగారి కోరికపై ముద్రించిరి. ఆ వెనుక రెండుమూఁడులు వీరికుమారులు శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారే ముద్రించియున్నారుకాని శ్రీ వేంకటగిరి ప్రభువులు ఏసహాయము గావింపరైరి. కృష్ణజన్మఖండమును, మాఘకావ్యమును కీర్తిశేషులు శ్రీ చదలువాడ సుందరరామశాస్త్రులవారు స్వకీయముగ ముద్రించినారు. మఱియుం గోపీనాథునువారి కవితావైశద్యము లోకమునకు వెల్లడించుటకు వీరి ప్రతిబింబమునుకూడ నాంధ్రలోకమునకుఁ బ్రసాదించుటకు శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారే కారకులు. వెంకట కవిగారు మరణించుటకు పూర్వదివసమున తీసిన ఛాయాపటమును శ్రీ వేంకటేశ్వర శాస్త్రిగారే సంపాదించి యాంధ్రపత్రికాధ్యక్షుల కొసగి, 1918వ సంవత్సరాది సంచికయందు ప్రకటింపజేసిరి. నేఁడును నీభగవద్గీతా శాస్త్రమును వారే పునరుద్ధరణముగావించి గీతామృతమును నాంధ్రభాషానువర్ణపాత్రికయందునించి యాంధ్రలోకమున కందిచ్చినారు.

భగవద్గీతావాఙ్మయప్రచారమునకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రుల వారొనర్చిన సేవయనిర్వచనీయమైనది. భగవద్గీతలు పెక్కు టీకాతాత్పర్యములతోఁ బ్రకటించుటయేగాక అణువ్యాఖ్యానములతోఁగూడిన పరమార్థచంద్రికావ్యాఖ్యానముతోఁగూడ వెలయించిరి. నేటికిని గీతాతత్త్వమెఱుఁగఁగోరువారికిది పెద్దనిక్షేపమువంటిది. ఇట్లు ప్రాచీన సంప్రదాయప్రకారమేగాక నవీనరీతిని గీతాతత్త్వమునెఱుంగుటకు, శ్రీ లోకమాన్య శ్రీ బాల గంగాధర తిలకు మహాశయుని "గీతారహస్యము"ను తెనుగున వారే ప్రకటించియున్నారు. ఇందులో పాశ్చాత్యవైజ్ఞానిక శాస్త్రసిద్ధాంతములు, ప్రాచీన భారతీయవిజ్ఞానముతో సమన్వయము చేయఁబడియున్నది. ఇది ప్రస్తుతము

ఆవశ్యకముగఁ బునర్ముద్రణము చేయఁదగినది. మఱియుఁ తెలుఁగు భాషలో మొదట, తిరుపతిక్షేత్రమున సంకీర్తనాచార్యులగు శ్రీతాళ్ల పాకం అన్నమయ్యగారి ప్రతులు పెదతిరుమలయ్యగారు. "ఆంధ్రవేదాంతము" అను పేర టీకను రచియించియున్నారు. అదియును శ్రీ వావిళ్లవారిచే ముద్రిత మగును. పై వానిలో ముఖ్యముగ గీతారహస్యము త్వరలో మరల ముద్రితము కాఁగలదని యాశించుచున్నాఁడను. మఱియును శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారు ఇతర 'గీతల'న్నిటినిగూడ ముద్రించుటకు నేర్పాటుచేయుట మందాహము.

ప్రస్తుతము ముద్రితమైన భగవద్గీతలో పద్యములు సులభగ్రాహ్యముగనుండి గీతా వివరణరూపమున మృదుమధురశైలినున్నది. ఈ భాషాంతరీకరణ మెట్లున్నదో చూపుటకు రెండుదాహరణముల నిచ్చుచున్నాను. ఇందు ప్రథమాధ్యాయము ప్రత్యేకముగ లేదు.

శ్లో. ఆపూర్యమాణమచలం ప్రతిష్ఠం సముద్రమాపః ప్రవిశన్తియద్వత్
తద్వత్కామాయం ప్రవిశన్తి సర్వేసశాంతి మాప్నోతి నకామకామీ.
ద్వితీయాధ్యాయము—70 శ్లోకము

ఉ. మెండుగవృష్టికాలమున మిన్నక పాఱు నదీప్రవాహముల్
నిండిచలింపకున్న యలనీరధిఁజేరిన మాడ్కినెవ్వనిన్
దండిగ సర్వకామములు తప్పక చేరునతండు శాంతుఁడై
యుండు; సకాముఁడైన నరుడొందఁడు శాంతినిఁ బాండునందనా!

శ్లో. యతంతో యోగినశ్చైనం పశ్యన్త్యాత్మన్యవస్థితం
యతంతోఽప్య కృతాత్మానో నైనం పశ్యన్త్యచేతసః 15 అ.—11 శ్లో.

చ. అలయక యోగులీతనిఁ బ్రయత్నముసేయుచు నాత్మయందుని
శ్చలముగనున్నవానిఁగ నిజంబునెఱుంగుదు రజ్ఞులైనని

శ్చలమతిహీనులొక్క మొగిఁజాలఁ బ్రయత్నము చేసియుఁగా సము
జ్జ్వలుఁడగు నీశుని౦ దెలియజాలరు భారత! నిక్కమింతయున్.

భారతీయ సంస్కృతిసౌధమునకుఁ బునాదియగు సనాతన ధర్మవాఙ్మయమును, నవీనకాలమునఁ బునరుద్ధరించుచున్న శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారు, భాషోద్ధారకులే గాక సనాతన ధర్మోద్ధారకులు-గీతాప్రణేత శ్రీ కృష్ణభగవానుఁడు శ్రీ శాస్త్రులవారి కాయురారోగ్యభాగ్యము ప్రసాదించుగాత!

ఇట్లు,

నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ.

# ఉపోద్ఘాతము

శ్రీ భగవద్గీతాశాస్త్రము మహాభారత భీష్మపర్వాంతర్గతము. ఇది తెనుఁగుభారతమునందుఁ దెనింగింపఁబడి యుండలేదు.

పూర్వము నాగోజీపండితపుత్త్రి దత్తోజీ పండితులు దీనిని తెనిం గించియున్నారుగాని యయ్యది త్రిమతస్థులు చేసినభాష్యములలో శ్రీ రామానుజభాష్యము ననుసరించి యుంటచే విశిష్టాద్వైతమతస్థులే చూడఁదగినదిగా నున్న దని చింతించి త్రిమతస్థులు చూడందగినట్లు మూలకర్తృభావము ననుసరించి యుండునట్లుగా శ్రీ. శ్రీ. వేంకటగిరి సంస్థానప్రభువులలో ౨౭ పురుషాంతరమువారయిన శ్రీ. శ్రీ. కుమారయాచమనాయనివారు గోపీనాథము వెంకటకవిచే క్రీ. శ. ౧౮౬౦ సం॥ దీనిఁ దెనింగింపఁ జేయించిరి.

దత్తోజీపండితులు విశిష్టాద్వైతపరముగాఁ దెనింగించినందునఁ గొన్నిచోటుల క్రింద గోపీనాథ వెంకటకవిభావముతో వివరింపఁబడును.

౧౨ అధ్యాయము ౬, ౭ శ్లోకములు. యేతు సర్వాణి కర్మాణిమయి సన్న్యస్య మత్పరాః, అనన్యేనైవ యోగేన మాంధ్యాయన్త ఉపాసతే. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్, భవామి నచిరాత్ పార్థ మయ్యావేశితచేతసామ్. దీనికి దత్తోజీపండితులు. వ. కావునసర్వకర్మంబులు నాయందు సమర్పించి మత్పరులై యన్యదేవతాసక్తంబుగాని చిత్తంబుచే నన్నుఁ గరచరణాద్యవయవసంయుక్తమూర్తిగాఁ దలఁపోయుచు, షడక్షరీ అష్టాక్షరీ ద్వాదశాక్షరీ ప్రభృతి వైష్ణవమంత్రోపాస్తి సేయుచు, నేమహాత్ము లుందురు. గీ. అట్టి మదధీనచిత్తుల నహరహంబు, నుద్ధరింపుదు వేగంబ యుందు

బలాత్మ. ఘోరతరమైన మృత్యుసంసారవార్ధి, యందు మగ్నులుగాకుండ నరసి సేతు. అని తెనింగించిరి.

ఆశ్లోకములకే ఈవేంకటకవి:—

౩౦౯, ౩౧౦ పద్యములలో. సీ. సతతంబు నాయందు సర్వకర్మం బులు విడిచి యన్యముగాని విశతయోగ, మునన్నుఁ దలఁచుచు మునుకొని మత్పరులై యెవ్వరు భజింతు రట్టియోగ, విదుల మదాసక్తహృదయుల సంసారపనధిలోపలఁబడి మునుఁగకుండ, వెన నుద్ధరించెద. అని తెనింగించెను.

౧౮ అధ్యాయము ౬౫, ౬౬ శ్లో. మన్మనా భవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు,మామేవైష్యసి సత్యం తే ప్రతిజానే ప్రియోఽసి మే. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వాసర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః. దీనికి దత్తోజీపండితులు. గీ. మన్మ నస్కుఁడగుము మద్భక్తుఁడవు గమ్ము, నన్నుఁబూజసేయుము నాకుమ్రొక్కు, మన్మదీయపదమునందు వర్తిల్లెదు, సఖుఁడవనుచుఁ బ్రీతినలిపినాఁడ. వ. వినుమర్జునా! భవదీయకులోచిత ధర్మంబులాచరించి నిర్భయుండవై యన్యదేవతా భజనంబు మాని నన్నొక్కని శరణంబునొందితేని నిన్ను సర్వపాపముక్తుఁ జేసెద శోకింపకు. అని తెనింగించిరి.

ఈశ్లోకములకు. వేంకటకవి. చ. కలఁగకనాకుభక్తుఁడవు గమ్మిక నాపయిఁజేర్చుచిత్తముక్, వెలువుగనాకుఁబూజనము సేయుము నాకునమస్క రింపుమిం, పలరఁగనాకుసన్మతుఁడవై తిని నీవిటు చేసితేని ని, శ్చలముగనన్నె పొందెదవు సత్యము గాఁగఁ బ్రతిజ్ఞ సేసెదన్. గీ. సర్వధర్మములను జయ్యన విడిచిన, న్నొకనిభక్తి శరణమొందుమిపావు, కరుణనిన్ను సర్వకలుషవిముక్తుని, జేసి కాతుఁజింత సేయవలదు. అని తెనింగించెను.

మూలశ్లోకములకు పై వారు తెనిఁగించిన భావములను జూడఁగా నీవ కలములో నుదాహరించిన యంశము తేటపడును.

సంస్కృతభాషయందనేక మోక్షగ్రంథములుండఁగా నాంధ్రభాషలోనున్న దీని వేలముద్రింపవలెనందురు. ఈ యాంధ్రదేశమందిపుడు సంస్కృతగ్రంథములు చూచువారు తఱుచుగ లేకుండుటయు నాంధ్రమం దుండెనేని యాసక్తులయిన యెల్లవారుం జూడనగుననుటయుఁ గారణంబు.

ఈ శ్రీ భగవద్గీతల మాహాత్మ్యము శ్రీ వరాహపురాణములో.
శ్లో. ప్రారబ్ధంభుజ్యమానోఽపి గీతాభ్యాసరతస్సదా, సముక్తస్సుఖీలోకే కర్మణానోపలిప్యతే. అనునది మొదలగు శ్లోకములచేఁ జెప్పంబడియున్నది గదా!

తండయార్పేట
చెన్నపురి 1951. }

ఇట్లు,
వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్

# విషయసూచిక


విషయము. ... పుటం.

## ద్వితీయాధ్యాయము, సాంఖ్యయోగము

అర్జునుండు తనవారిపై యుద్ధంబు సేయ సంశయించుట ... 1
అర్జునునికిఁ దత్సంశయంబు నివారింపఁ దత్త్వంబు దెలుపుట ... 3
కులధర్మం బుత్తమంబనుట ... 6
యోగము అనఁగా జ్ఞాన ప్రాప్త్యుపాయము ... 8
యోగలక్షణము ... 9
కర్మయోగముకంటె జ్ఞానయోగం బెక్కుడనుట ... 9
స్థితప్రజ్ఞులక్షణము ... 10
విషయచింతనచేఁ గలుగుచెరుపు ... 12

## తృతీయాధ్యాయము - కర్మయోగము

కర్మ యజ్ఞ ఫలము ... 15
అన్నాదులయుత్పత్తి ... 16
దొడ్డవాని కర్మననుసరించి లోకంబు ప్రవర్తించుట ... 17
కర్మాసక్తులైనవారికి బుద్ధి చెఱుపఁగూడదు ... 18
ఇట్టివారు చెడుదురు ... 19
కులధర్మమే శ్రేష్ఠంబనుట ... ,,
కామంబు సర్వదోషమూలం బనుట ... 20

## చతుర్థాధ్యాయము - జ్ఞానయోగము

ధర్మసంస్థాపనకై భగవంతుండు పుట్టు ననుట ... 22
కర్మాకర్మవికర్మస్వరూపము ... 24

| విషయము. | | పుట. |
|---|---|---|
| యోగులుచేయు ద్రవ్యయజ్ఞజ్ఞానయజ్ఞములు | ... | 25 |
| ఆచార్యునియొద్ద జ్ఞానోపదేశంబు చేసికొనుట | ... | 26 |
| సంశయాత్మాదులు చెడుదురనుట | ... | 25 |
| **పంచమాధ్యాయము, కర్మసన్న్యాసయోగము** | | 28 |
| **షష్ఠాధ్యాయము, ఆత్మసంయమయోగము** | | |
| యోగాభ్యాసలక్షణము | ... | 34 |
| మనోనిగ్రహోపాయము | ... | 39 |
| యోగభ్రష్టునికిఁ గల్గుగతి | ... | ,, |
| **సప్తమాధ్యాయము, విజ్ఞానయోగము** | | |
| పరాపరప్రకృతుల స్వరూపము | ... | 41 |
| పరవస్తునిరూపణము | ... | 42 |
| అన్యదేవతారాధన ఫలము | ... | 44 |
| **అష్టమాధ్యాయము, అక్షరపరబ్రహ్మయోగము** | | |
| అర్చిరాదిమార్గప్రస్తావము | ... | 50 |
| **నవమాధ్యాయము, రాజవిద్యారాజగుహ్యయోగము** | | |
| భగవంతు నుపాసించువారల భేదములు | ... | 52 |
| పత్రపుష్పాదులు భగవత్ప్రీతికరము లనుట | ... | 54 |
| భక్తుఁడు చేయుం బనులన్నియుం భగవంతుని కర్పింపవలె ననుట | ... | 55 |
| స్త్రీశూద్రపాపజాతులు దేవునిభజించిరేని వారును మోక్షంబు నందుదు రనుట | ... | ,, |

విషయము. | పుట.

## దశమాధ్యాయము, విభూతియోగము

భగవద్భక్తిసేయువారి యజ్ఞానంబు భగవంతుఁడే
పోఁగొట్టుననుట ... 57
విభూతివిస్మృతి ... 59

## ఏకాదశాధ్యాయము, విశ్వరూపసందర్శనయోగము

అర్జునునికి దివ్యదృష్టి నిచ్చుట ... 63
విశ్వరూపము ... 64
విశ్వరూపంబుఁ జూచి యర్జునుండు భయంబునొందుట ... 66
విశ్వరూపధరుని నీ వెవ్వండ వనియడుగుట ... 67
అర్జునుండు శరణాగతుం డగుట ... 70
విశ్వరూపంబు నుపసంహరించుట ... 71
సౌమ్యరూపంబు చూపుట ... 72
ద్వాదశాధ్యాయము, భక్తియోగము 73

## త్రయోదశాధ్యాయము, క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

క్షేత్రలక్షణము ... 77
క్షేత్రజ్ఞలక్షణము ... 78
జీవప్రకృతి కార్యములు ... 79
పరమాత్మను గాంచువారు ... 80
ఉపదేశంబుచేతనే తరించువారు ... 81
బ్రహ్మంబు నిర్గుణం బనుట ... 82

## చతుర్దశాధ్యాయము, గుణత్రయవిభాగయోగము

ప్రకృతిపురుషులు జగంబులకుఁ దల్లిదండ్రులనుట ... 83

విషయము. ... పుట.

సత్త్వరజస్తమోగుణవిభాగములు ... „

చచ్చునప్పు డేగుణం బున్న నాజన్మంబు వచ్చుననుట ... 84

త్రిగుణాతీతులక్షణము ... 86

సంసారవృక్షవివరణము ... 87

## పంచదశాధ్యాయము, పురుషోత్తమప్రాప్తియోగము

సంసారవృక్షఖండనము ... „

జీవసృష్టిక్రమము ... 88

సూర్యాదులందుఁ గల తేజోధారణాదులు భగవంతునివలననే గల్గుననుట ... 89

క్షరాక్షరాతీతనిరూపణము ... 90

## షోడశాధ్యాయము, దైవాసురసంపద్విభాగయోగము

దైవసంపద - అసురసంపద ... 91

నన్ను ద్వేషించువారలకు నీచజన్మాదులు గలిగింతు ననుట ... 94

## సప్తదశాధ్యాయము, శ్రద్ధాత్రయవిభాగయోగము

సత్త్వరజస్తమోగుణ స్వరూపము ... 95

సాత్త్వికరాజసతామసులు సేయు పూజాభేదములు ... „

వారియాహారభేదములు ... 96

వారియజ్ఞభేదములు ... 97

వారివారి కాయిక మానసిక వాచిక తపస్సులు ... „

వారిదానములు ... 98

ఓంతత్సచ్ఛబ్దప్రయోగవిధులు ... 99

| విషయము. | | పుట. |
|---|---|---|

## అష్టాదశాధ్యాయము, మోక్షసన్న్యాసయోగము


| | | |
|---|---|---|
| త్యాగలక్షణము | ... | 100 |
| సాత్త్వికరాజసతామసత్యాగములు | ... | 101 |
| ఇష్టానిష్టమిశ్రకర్మఫలములు | ... | ,, |
| కర్మసిద్ధి కారణపంచకము | ... | 102 |
| అనహంకృతుఁడు బద్ధుఁడు గాఁడనుట | ... | ,, |
| సాత్త్వికరాజసతామసజ్ఞానములు | ... | 103 |
| పైవారి త్రివిధకర్మములు | ... | ,, |
| త్రివిధకర్తలు | ... | 104 |
| సాత్త్వికరాజసతామసబుద్ధులు | ... | ,, |
| త్రివిధధైర్యములు | ... | 105 |
| త్రివిధసుఖములు | ... | ,, |
| బ్రాహ్మణాదివర్ణస్వభావ కర్మగుణములు | ... | 106 |
| స్వధర్మంబుననే తరించు ననుట | ... | 107 |
| జ్ఞాననిష్ఠ | ... | 108 |
| పరమరహస్యము | ... | 110 |
| ఇట్టిదుర్బుద్ధి కీశాస్త్రం బుపదేశింపఁగూడదనుట | ... | ,, |
| సుబుద్ధి కుపదేశించువానిఫలము | ... | ,, |
| శాస్త్రఫలశ్రుతి | ... | [illegible] |

శ్రీ ర స్తు

# శ్రీ భ గ వ ద్గీ తా శా స్త్ర ము

అను

# మో క్ష గ్రం థ ము



శా. శ్రీకైవల్యరమాధినాథుఁడు లసచ్ఛృంగారరేఖామనో
జ్ఞాకారుండు భవాబ్ధితారణచణానంతప్రభావుండు లో
కైకత్రాణపరాయణుండు ఘనసత్యానందచిద్రూపుఁడుం బ్రన్.
శ్రీకృష్ణుండు కుమారయాచనృపతింజెల్వొందఁ బ్రోచుం గృ

క. శ్రీవసుదేవకుమార ర
మావల్లభ భక్తలోకమందార హరీ
పావనచరిత్ర విధిముఖ
సేవితచరణారవింద శ్రీగోవిందా. 2

వ. దేవా యవధరింపుము శ్రీవేదవ్యాసవరప్రసాదలబ్ధవిజ్ఞాన విదిత వాసుదేవధనంజయచరిత్రుండగు సూతపుత్త్రుండు విచిత్రవీర్యపుత్త్రున కిట్లనియె. 3



## ద్వితీయాధ్యాయము, సాంఖ్యయోగము.

అర్జునుండు తన వారిపై యుద్ధంబు సేయ సంశయించుట

గీ. అటు కృపావిష్టమానసుం డగుటఁ జేసి
యశ్రుపూర్ణాకులేక్షణుండై దురంత

శోకభరమున నున్న యర్జునునిఁ జూచి
యింపు దీపింప మధువైరి యిట్టు లనియె. 4

క. అనఘా యీకశ్మలమె
ట్లనువుగ నినుఁ బొందె విషమమం దస్వర్గ్యం
బనిశంబు కీర్తినాశన
మనార్యజుష్టం బయోగ్యమగు నిది దలఁపన్. 5

క. పందతనం బది మానుము
పొందుగ నీయందుఁ జేర్పఁబోలదు దీనిం
డెందాన నున్న దుర్బల
తం దలఁగఁగఁ బెట్టి లెమ్ము ధైర్యము కలిమిన్. 6

వ. అనిన నర్జునుం డి ట్లనియె. 7

గీ. అకట పూలఁ బూజింపంగ నర్హులైన
ద్రోణభీష్ముల సంగరక్షోణి డాసి
కలుకుటమ్ముల నెబ్బంగి గాఁడ నేతు
నింతకంటెను దుష్కార్య మెద్ది నాకు. 8

చ. వెలయఁగ నర్థకాములగు వృద్ధుల నార్యులఁ దున్మి నెత్తుటం
గలసిన భోగముల్ గుడుచుకంటెఁగరంబు మహానుభావులన్
గులగురులన్ వధింపక యకుంఠితవైఖరి భైక్షవృత్తిచే [వా.
నిల నవిరోధతం బ్రతుకు టెంతయు శ్రేయము గాదె మాధ

వ. అదియునుం గాక మనము వారలం గెలిచెదమో? వారు
మనలం గెలిచెదరో? యీ రెంటిలోన నెయ్యది యెక్కుడో
యెఱుంగరాదు. ఎవ్వారల రణంబున వధించి తద్వ్యస

నంబున జీవింపంజాలమో యట్టి ధృతరాష్ట్రపుత్త్రు లైన దుర్యోధనాదులుమ్రోల నభిముఖులై యున్నవారు కార్పణ్య దోషోపహతస్వభావుండ నైన యేను న్యాయంబునందు మిక్కిలిమూఢం బైనచిత్తంబు గలవాఁడనై నిన్నడుగుచున్న వాఁడ నెయ్యది శ్రేయం బని మీచేత నిశ్చితం బయ్యె దాని నెఱింగింపు మేను నీకు శిష్యుండ. ప్రపన్నుండనై నన్ను సంశ యచ్ఛేదకవాక్యంబులచేత శాసింపు మేను. నిష్కంటకంబై సమృద్ధంబైన రాజ్యంబు సంగ్రామవిజయలబ్ధం బైనను సురాధిపత్యంబుదొరకొనిన నెయ్యది యింద్రియశోషణకరం బైనమద్దుఃఖంబు నపనయింపంజాలు నట్టికార్యంబు నేను విలోకింపనుగదా యని పలికి గుడాకేశుండగు పార్థుండు యుద్ధంబు సేయ నొల్లకయుభయసేనామధ్యంబున దుఃఖింపు చున్న నతనిం గాంచి నవ్వుచు గోవిందుం డిట్లనియె. 10

అర్జునునికిఁ దత్సంశయంబు నివారింపఁ దత్త్వంబు దెలుపుట.

గీ. పార్థ వగవఁ దగనివారి నుద్దేశించి
వగచెదీవు బుద్ధివాదములను
బలికె దిట్లు చన్నవారల మనియున్న
వారిఁ గూర్చి బుధులు వగవ రెందు. 11

గీ. ఏను లేనివాఁడఁ గాను నీవును గావు
లేనివాఁడ వీధరానరపులు
లేనివారు గారు మానుగ మన మెల్ల
నున్నవార మంగ మున్నుఁ జనిన. 12

గీ. దేవపతిపుత్త్ర దేహి కీదేహమందు
బాల్య యౌవన జరల సంప్రాప్తి యెట్టు

లట్లు దేహాంతరప్రాప్తి యగు వివేకి
యైనవాఁడు మోహింపఁ డీయర్థమందు. 13

సీ. పంచతన్మాత్రలు స్పర్శలు శీతోష్ణ
సుఖదుఃఖములఁ జేయు సొరిది వాని
కిలరాకపోకలు గలుగుటఁ జేసి య
నిత్యంబు లగువాని నెఱి సహింపు
మవి సమసుఖదుఃఖుఁడగు ధీరునె
వ్వాని బాధింపఁజాలవా పండితుండు
ఘనముక్తికొఱకుఁ దాఁగల్పింపఁబడు ధాత్రి
లేనివానికి యునికి లేదయున్న

గీ. దానికి నభావమును లేదు తత్త్వవిదుల
చేత నీ రెంటి నిర్ణీతి సేయఁబడియె
నఖిలలోకమెద్దానిచే వ్యాప్తమయ్యె
దానినవినాశివస్తువుగా నెఱుంగు. 14

క. నాశంబు లేనియాత్మకు
నాశము గావించు కొఱకు నలువొప్పగు డా
క్లేశా యీలోకంబున
లేశము దక్షుఁ డగువాఁడు లేఁడు దలంపన్. 15

చ. నలువుగనప్రమేయుఁడయి నాశవిహీనతనొంది నిత్యుఁడై
యలరుశరీరి కీతనువులన్నియు బుద్ధ్యదసన్నిభంబులై
గలయఁగనాశముం గలవిగాఁ బలుకంబడెనోలినీవునీ
కలఁకదొలంగఁ బెట్టి రిపుఘస్మరయుద్ధమొనర్పుమిత్తఱిన్. 16

గీ. ఒరులచేఁజచ్చువానిఁగా నొరులఁజంపు
వానిఁగా దేహినిదలంచు వారిరువురు

పరఁగ నజ్ఞాను లనియెన్నఁ బడుదు రర్జున
జంపఁ డన్యుల నొరులచేఁ జావఁ డతఁడు. 17.

**గీ.** జీవునకు జన్మమరణముల్ లే వొకప్పు
డరయఁబుట్టినట్లై తోఁచి తిరిగిగాక
యును నజుఁడు శాశ్వతుఁడు నిత్యుఁడురుపురాణుఁ
డవని మేనది వోయిన నతఁడు వోఁడు. 18

**గీ.** ఆతని నిత్యునిఁగాఁగ నవ్యయునిఁగాఁగ
నజునిఁగా నవినాశుఁగా నాత్మ నెవ్వఁ
డెఱుఁగు నతఁ డెవ్విధంబున నెవనిఁజంపు
నెవనిఁజంపింపఁ దలకొను నింద్రతనయ. 19

**క.** నరుఁ డెట్లు జీర్ణపటములు
పరిత్యజించి ఘననూత్నపటములఁ గొనున
ట్లరయఁగ జీర్ణాంగంబుల
నరవిడిచి గమించు దేహి నవ్యాంగంబుల్. 20

**సీ.** జితవైరి యాతఁ డచ్ఛేద్యుండు గావున
శస్త్రముల్ ఛేదింపఁ జాలవతనిఁ
గరమదాహ్యుఁడుగానఁ గనలి వైశ్వానరుం
డొగినాతని దహింపనోపఁడెందుఁ
గలిమి నక్లేద్యుండు గావున నాతని
జలము సంక్లేదింపఁ జాల దెపుడుఁ
దగ నశోష్యుఁడు గాన మగటిమి వాటించి
చెలఁగి మారుతము శోషింపఁ జాల
**గీ.** దతఁడు నిత్యుఁడు స్థాణు వవ్యక్తుఁ డచలుఁ
డజుఁ డచింత్యుఁడు నవికార్యుఁ డఖిలగతుఁడు

కడుసనాతనుఁడని చెప్పఁబడెనుగాన
నతని నెఱిఁగి శోకింపంగనర్హ మగు నె. 21

చ. ఎడ తెగకిట్టులేయితని నెప్పుడుఁబుట్టెడువానిఁగాఁగనె
ప్పుడుమృతుఁగాఁదలంచితివిపోయటులైనను బుట్టువానికిన్
దొడిఁబడిచేటునిక్కము మృతుండగు వానికిజన్మమట్లయహాఁ
గడు ననివార్యమె త్తెఱఁగుగావున దీనికి దుఃఖమేటికిన్. 22

గీ. అనఘ భూతంబు లాదినవ్యక్తములును
మధ్యమందు వ్యక్తంబులై మరియునంత
మందునవ్యక్తరూపంబులై తనర్చుఁ
బార్థ,యీయర్థమందేల వగపునీకు. 23

క. ఒకఁడాశ్చర్యముతోఁగను
నొకఁడచ్చెరువందినట్టు లొగిఁబల్కును వే
రొకఁడతిచిత్రంబుల విను
నొకఁడు వినియు నతనిఁ దెలియనోపఁడువిజయా. 24

గీ. అనఘ యీ దేహిసర్వదేహంబునందు
నరసిచూడనవధ్యుఁడై యలరుచుండుఁ
గాననీభూతతతులనుగాంచినీకు
శోకమొందంగఁ జెల్లదు సూరివినుత. 25

కులధర్మం బుత్తమంబనుట

క. నరపతుల కాజికంటెను
ధరలో శ్రేయంబొసంగు ధర్మమొకటిలే
దరయఁగ స్వధర్మముం గని
యురువిక్రమ నీవు కంప మొందకుమింకన్. 26

వ. ధనంజయా సుఖవంతులైన క్షత్త్రియులు తనయంతనుప
పన్నంబగు నపావృతస్వర్గద్వారంబునగు నేతాదృశ
యుద్ధంబు కాంక్షింతురు. రాజధర్మంబైన యీసంగ్రామంబు
గావింపవేని స్వధర్మపరిత్యాగంబున నపకీర్తియును బాపంబు
నుంబొందెదవు. భూతంబులు భవదీయంబైన యపయశంబు
నాశంబు లేనిదానిఁ గానొడువంగలయవి సంభావితుండైన
వాని కపయశంబు మరణంబుకంటె నధికంబై యుండు. 27

గీ. పార్థ యెవ్వారలకు నీవు బహుమతుండ
వైతి వట్టి మహారథు లతిభయమున
నాజిగావింపక దొలంగె ననుచు నినుఁ ద
లంతు రందున నినుఁబొందు లాఘవంబు. 28

క. భవదురు సామర్థ్యము రేఁ
బవలును నిందించు నట్టి పగతు లిఁక నవా
చ్యవచనములు వలుకుదు రో
కవినన్నుత యంతకంటెఁ గష్టముగలదే. 29

క. గెడసిన నాకము నొందెద
వెడపక పగతుల జయించితేనియుఁ బుడమిఁగా
గుడిచెదవు గానసందియ
ముడిగి కిరీటి వెస లెమ్ము యుద్ధంబునకున్. 30

క. మనమున సుఖదుఃఖము లో
య్యన లాభా లాభములు జయాపజయంబుల్
విను సరిగాఁ గనుఁగొని రణ
మొనరింపఁ గడంగు మఘము లొందవు నిన్నున్. 31

యోగమనఁగా జ్ఞాన ప్రాప్త్యుపాయము

గీ. సాంఖ్యమందు నీకుఁ జతురత నీబుద్ధి
యుక్త మయ్యెనింక యోగమందు
దీని వినుము పార్థ పూనిక నెద్దానిఁ
బడయఁబాయుఁ గర్మబంధనములు. 32

గీ. కలుగ దారంభ నాశంబు గలుగదిందుఁ
బ్రత్యవాయ మీధర్మంబు స్వల్పమైన
నవన మొనరించుభూరి భయంబు వలన
దేవపతిపుత్త్ర యొకఁగింతు దీనివినుమ. 33

గీ. అనఘ యిచటనిశ్చయాత్మిక యగుబుద్ధి
నెగడు నొకటి యగుచు నిశ్చయంబు
లేనివారిబుద్ధు లానంత్యమును బొంది
జగతిఁ బరఁగుఁబెక్కుశాఖ లగుచు. 34

వ. మరియుఁ నన్యంబు లేదని వేదంబులయర్థవాదంబులం దభి
రతులగు కేవలవాదశీలు రైన యపండితులే యీపుష్పిత
వాక్యంబు నొడువుదు రవ్వాక్యంబు కామాసక్తులును స్వర్గ
పరులునగు జనంబులచేత జన్మకర్మఫలప్రదంబును క్రియావి
శేషబహుళంబు నగుసుఖసౌభాగ్యగతి నుద్దేశించి పలుకం
బడుఁ గావున. 35

గీ. పార్థ యట్టిభోగైశ్వర్యపరులు తదప
హృతమనస్కులు నగు వారికించుకైన
మహిత మైనట్టి యాత్మసమాధియందు
నిశ్చయాత్మిక యై బుద్ధి నిలువ దెపుడు. 36

గీ. వేదములు చూడఁ ద్రైగుణ్యవిషయము లగు
వినుము నీవు గుణత్రయ విరహితుఁడవు
నరవి నిర్ద్వంద్వుఁడవు నిత్యసత్త్వగతుఁడ
వరయ నిర్యోగుఁడవు నాత్మపరుఁడ వగుము. 37

వ. మరియు బ్రహ్మజ్ఞానసంపన్నుండైన బ్రాహ్మణునకు ముఖపాద ప్రక్షాళనాదిస్వల్పకార్యోపయోగి యైనకూపంబునం దెంత మాత్రంబు ప్రయోజనంబుగలిగి యుండు నంత ప్రయోజనంబు వేదచోదితంబులైనసర్వకర్మంబు లందునుంగలిగి యుండు. స్నానపానవస్త్రక్షాళనాది సర్వకార్యోపయోగి యైనవిశాల తటాకాదికంబునం దెంతప్రయోజనంబు గలిగి యుండు నంతప్రయోజనంబు బ్రహ్మవిషయక జ్ఞానంబునందుఁ గలిగి యుండు. నీకుఁగర్మంబునందె యధికారంబు గలుగుం గాని కర్మఫలంబునం దొకానొకప్పుడైన నధికారంబులేదు గావున నీవు కర్మఫలహేతువుగా వలవదు ఫలపరిత్యాగ పూర్వకంబుగా సముచిత కర్మంబు లాచరింపు మని పలికి వెండియు ని ట్లనియె. 38

యోగలక్షణము

చ. ఉడుగక సంగము న్విడిచి యోగ గతుండవునై సముండవై
కడుఁవడి సర్వ కర్మములు గైకొని సేయుము సిద్ధ్యసిద్ధులం
గడఁగి సమంబుగా మదిని గన్గొను టంతియె యోగమంచు నే
ర్పడరఁగనాత్మతత్త్వవిదులైనబుధుల్ వచియింతు రర్జునా.

కర్మయోగముకంటె జ్ఞానయోగం బెక్కుడనుట

గీ. పుడమి బుద్ధి యోగమునకంటెఁ గడు దూర
మగుటవలనఁగర్మ మల్ప మెందు

వలనఁ గృపణు లుర్వి ఫలహేతులై యుందు
రందువలన బుద్ధి నాశ్రయింపు. 40

గీ. బుద్ధితోఁ గూడుకొన్నట్టిపురుషుఁ డిచట
సుకృతదుష్కృతములరెంటి సొరిదివిడుచుఁ
గాన యోగంబు నొందుము కలఁక విడిచి
కర్మములయందు యోగంబు కౌశలంబు. 41

గీ. అనఘ బుద్ధియుక్తుఁ డైన విద్వాంసుండు
పరఁగఁగర్మజాతఫలము విడిచి
పుడమిజన్మబంధముక్తుఁడై దగ ననా
మయపదంబుఁ జేరు మహితుఁడగుచు. 42

గీ. నృపవరకుమార యెప్పుడు నీదుబుద్ధి
మోహకాలుష్యమును దాఁటి మొనయు నపుడు
వినఁగఁదగినదానికి మరి వినినదాని
కెలమి వైరాగ్యమును బొందఁగలవునీవు. 43

క. శ్రుతివిప్రతిపన్నంబై
యతినిశ్చలమై సమాధియం దచలంబై
మతి నీకెప్పుడు కుదురును
జితవైరీ యపుడు యోగసిద్ధియుఁ గలుగున్. 44

స్థితప్రజ్ఞులక్షణము

వ. అనిన నర్జునుండు వాసుదేవుం జూచి కేశవా సమాధియందు
నిశ్చల యైనబుద్ధిగలపురుషునకు సంభాషణంబెద్ది యేమి
పలుకు నెట్లు గూర్చుండు నెట్లు నడుచు నని యడిగిన భగ
వంతుం డిట్లనియె. 45

మ. అరుదారం గురుచర్యదేహినియతుండై యాత్మయందాత్మచేఁ
బరితుష్టుండయి చిత్తసంకలితసర్వవ్యాప్తులన్ వీడి తాఁ
బరిశుద్ధుండయి యెప్పుడొప్పు నపుడా ప్రజ్ఞాసమాయుక్తుఁడు
ర్వరలోనార్యులచేతఁ బేర్కొను స్థితప్రజ్ఞుండునా నెంతయున్.

గీ. తవిలి సుఖముల యందు గతస్పృహుండు
వితతదుఃఖములం దనుద్విగ్నచిత్తుఁ
డపగత క్రోధభయరాగుఁడై తనర్చు
నతఁడు స్థితధి యనంగ విశ్రుతి వహించు. 47

క. పొందుగ నెవ్వఁడు సర్వము
నం దనభిస్నేహుఁడై శుభాశుభములఁ దా
నొందియు హర్ష ద్వేషము
లొందఁ డతని ప్రజ్ఞ చాల నొప్పు నచలమై. 48

గీ. అవని నెవ్వఁడు కూర్మావయవము లట్లు
యింద్రియార్థంబులవలన నింద్రియములఁ
గడిమి నుపసంహరించు నాఘునిబుద్ధి
పాండుతనయ సుస్థిరయయి పరఁగుచుండు. 49

గీ. మానితముగ నిరాహారుఁడైనఁ దేహి
కరయ రక్తిదక్కఁగ విషయములుమరలుఁ
బరఁగ నవ్వాల వీనికిఁ బరముఁ జూచి
వరుస రక్తియు మరలింపఁబడుఁ గిరీటి. 50

సీ. ఒనర యత్నము సేయుచున్నవాఁడైనఁ గా
కేమి విద్వాంసునియింద్రియంబు
లతిబలవంతంబులై మనంబును బలా
త్కారంబుగాఁగ నొక్కట హరించుఁ

గావునయోగి తక్కక యింద్రియంబుల
నేమించి నాయందుఁ బ్రేమగలిగి
యలరు నెవ్వాని కింద్రియములు స్వాధీనంబు
లగు వానిమతి నిశ్చయాత్మిక యగు
విషయములను జింతించుపురుషున కందుఁ
గలుగుసంగంబు మరియు సంగంబువలనఁ
గలుగుఁ గామంబు కామంబు వలనఁ గ్రోధ
మందువలన జనించు మోహంబుపార్థ 51

విషయచింతనచేఁ గలుగుచెరుపు

సీ. పరఁగ మోహంబుచే స్మృతిభ్రంశనంబు
గలుగు మరియు స్మృతిభ్రమవలన బుద్ధి
నాశము జనించు తద్బుద్ధినాశనమునఁ
బురుషుఁడు నశించు నిక్కంబు కురువరేణ్య. 52

వ. అర్జునా రాగద్వేషవిహీనంబులై తనకు వశ్యంబులైన యింద్రియంబులచేత విషయంబు లనుభవింపుచుండియు స్వాధీనంబైనయాత్మగల పురుషుండు నిర్మలుండగు నట్టినిర్మల పురుషుని దుఃఖంబులన్నియు హైన్యంబు నొందు నిర్మల చిత్తుండైనవానికి శీఘ్రంబున బుద్ధి నిశ్చలయై ప్రకాశించు.

సీ. పుడమి యోగహీనున కెన్న బుద్ధి లేదు
లేదు భావన భావన లేనివాని
కతులింతంబుగఁ జిత్తోపరతియు లేదు
శాంతి లేనివానికి నెట్లు సౌఖ్య మొదవు. 54

క. చలియింపుచున్నయింద్రియ
ములవెంటఁ దిరుగు మనము బుద్ధిని మిగులన్

దలకొని యాకర్షించును
నిలువుగ మున్నిట గాడ్పు నావం బోలెన్. 55

వ. కావున. 56

క. తలపఁగ నెవ్వనియింద్రియ
ములు దుర్విషయేంద్రియార్థములవలన రహిం
దొలఁగింపఁగఁబడునాబుధ
తిలకునిమతి యొప్పుఁ గడుఁ బ్రతిష్ఠిత యగుచున్. 57

గీ. సర్వభూతంబులకు నెద్ది శర్వరి యగు
నందు మేల్కాని యుండు సంయమివరుండు
అనఘ భూతంబు లెందు మేల్కాని వసించు
నదియె నిశ యగుఁ బరికించు నట్టిమునికి. 58

ఉ. మెండుగ వృష్టికాలమున మిన్నక పాఱునదీప్రవాహముల్
నిండి చలింప కున్ననీయలనీరధిఁ జేరినమాడ్కి నెవ్వనిం
దండిగ సర్వకామములు తప్పక చేరు నతండు శాంతుఁడై
యుండుసకాముఁడైననరుఁడొందఁడుశాంతిని బాండునందనా.

గీ. అరయనెవ్వఁడు నిస్పృహుండై సమస్త
కామముల దిగ నాడి నిష్కాముఁడగుచు
తగ నహంకారమును లేక దనరు నతఁడు
పుడమిలోపల నుపరతిఁ బొందు సుమ్మి. 60

వ. అర్జునా యీస్థితి బ్రహ్మవిషయంబైనయది. దీని నధిగమిం
చినపురుషుండు మోహంబు నొందఁడు. దీనియం దవసాన
కాలంబునందైన నిల్చి బ్రహ్మసుఖంబు వడయం గలఁ డని
యిట్లు ద్వితీయాధ్యాయంబునందు సాంఖ్యయోగం బుపదే
శించెను.

---

## తృతీయాధ్యాయము - కర్మయోగము.

అదివిని యర్జునుండు గోవిందునిం జూచి దేవా మీకుఁ గర్మంబుకంటె జ్ఞానంబు శ్రేష్ఠతరంబైన దని సమ్మతం బగునేని ఘోరంబైన యాకర్మంబునందు నన్నేల నియమింపు చున్న వాఁడవు. వ్యామిశ్రంబైన దాని యట్లు ప్రతీయ మానం బగువాక్యంబుచేత మద్బుద్ధిని మోహింపం జేయు వానిపోలిక నున్నవాఁడవు నాకు నెద్దానిచేత శ్రేయంబు నొంద శక్యం బగు నట్టిదానినొక్కటి నిశ్చయించి చెప్పు మని యడిగిన నయ్యర్జునునికిఁ గృష్ణుం డిట్లనియె. 61

మ. విలసద్విక్రమ తొల్లి సాంఖ్యులకునుర్విన్ జ్ఞానయోగంబుచేఁ
దిలకింపం దగు నట్టి యోగులకుఁ బ్రీతిం గర్మయోగంబుచే
నలు వొప్పన్ స్థితి రెండు మార్గములుగా నాచేతఁ జెప్పంబడెం
దెలియం జెప్పెద దాని విస్తరగతిన్ ధీవర్య యాలింపుమా॥

క. కర్మము లొనర్పకుండిన
నిర్మలమతి గలుగ దెపుడు నిష్కర్మత్వం
బర్మిలి సన్యాసంబున
శర్మదమగు సిద్ధి వడయఁ జాలఁడు విజయా. 63

సీ. ప్రకృతిగుణంబులఁ బ్రాపించి యవశులై
సర్వజనంబులు సంతతంబు
నుడుగక కర్మంబు లొనరింపుచున్నారు
గణుతింప నొక త్రుటికాలమైన
గర్మ ప్రవిష్టుండు గానివాఁ డొకఁడైన
నిలలోన లేఁడు కర్మేంద్రియముల

మునుకొని నియమించి మనముచే నింద్రియ
చయవిషయంబుల సంస్మరించు
నెవ్వఁడతఁడు వివేకవిహీనుఁ డగుచుఁ
గలఁకతోఁ డమిథ్యాచారకలితుఁడనఁగఁ
బృథివిలోఁ నెన్నఁబడుఁ దత్త్వవిదులచేతఁ
బార్థివస్తుత్యసుచరిత్ర పాండుపుత్ర. 64

గీ. అనఘ జ్ఞానేంద్రియంబులమనముచేత
నాఁగి యెవ్వాఁడు కర్మేంద్రియములచేత
మమత నాసక్తిలేక కర్మంబు సేయు
నట్టిపురుషుండు విద్వాంసుఁడనఁగఁ బరఁగు. 65

గీ. కర్మ మతిఘనం బకర్మంబుకంటెఁ గ
ర్మంబు లేనినీకు మహి శరీర
యాత్రసిద్ధి గలుగ దటు గావున నియత
కర్మ మిపుడు సల్పఁ గడఁగుమీవు. 66

### కర్మయజ్ఞ ఫలము

గీ. మఱియు యజ్ఞార్థమైనకర్మమునకంటె
నితరకర్మంబు లవి బంధహేతువు లగుఁ
గాన నీశ్వరార్థంబైన కర్మమీవు
ముక్తసంగుండవై సలుపుము కిరీటి. 67

క. అజుఁడు మును యజ్ఞయుతముగఁ
బ్రజలన్ సృజియించి పలికెఁ బదపడి మీరల్
సృజియింపుఁ డిమ్మఖముచే
నిజముగ నిది మీకుఁ బిదుకు నిఖిలార్థంబుల్. 63

క. దేవతల నిమ్మఖంబున
భావన సేయుండు మిమ్ము బాగుగవారల్
భావనసేతు రుభయు లటు
భావితులై పరమసిద్ధిఁ బడయుఁడు పేర్మిన్. 69

గీ. యజ్ఞసంయుతులై మీకు సమరులఖిల
భోగములొసంగుదురు వారు పొసఁగ నిచ్చి
నట్టివాని వారలకీక యనుభవించు
నట్టిపురుషుండు తస్కరుం డనఁగఁ బరఁగు. 70

గీ. సవన శిష్టాన్నభోక్తలౌ సాధుజనము
లఘుచయంబులచే ముక్తులగుదు రెలమిఁ
బుడమి నేదుర్జనుఁడు తనపొట్టకొఱకుఁ
బాక మొనరించు నతఁడు పాప మొందు. 71

అన్నాదులయుత్పత్తి

క. అన్నమున సకలభూతము
లన్నము పర్జన్యువలన నాపర్జన్యుం
డెన్నఁగ యజ్ఞమువలనను
జన్నము కర్మమునఁ బుట్టె శక్రజ వరుసన్. 72

గీ. వేదమునఁ బుట్టెఁగర్మంబు వేదమరయ
నాత్మయందుద్భవంబయ్యె నట్లుగాన
సర్వగతమును నిత్యంబు సర్వసంప్ర
తిష్ఠితంబయి వేదంబు తేజరిల్లు. 73

క. ఈపగిది నొప్పు చక్రం
బేపురుషుం డనుసరింపఁడిల నామూఢుం

డేపున నింద్రియవశుఁడై
పాపాయుష్మంతుఁ డగుచు బ్రతుకును వృథగాన్. 73

గీ. ఆత్మచేతఁదృప్తుఁడాత్మయందాసక్తుఁ
డాత్మయందె తుష్టుఁడై చెలంగు
నెవ్వఁ డట్టివానికించుకయైనను
మొనసి సేయఁ దగినపనులు లేవు. 74

చ. ఘనతఁగృతాకృతం బయినకార్యముచే భువివానికిఁ బ్రయో
జనమది లేదు భూతముల సంతత మర్థనిమిత్త మాశ్రయిం
పను బని లేదుగానఁ బరిపాటిగఁ గర్మ మొనర్పు మీవు సం
గనిరతి మాని యుక్తమగుకర్మ మొనర్పఁ బరంబు చేకుఱున్.

క. జనకాదినృపులు కర్మం
బుననె పరముఁ గాంచి రట్లు భూసంగ్రహముం
గని యైన నీతివిడువక
ఘనమతిఁ గర్మంబు సల్పఁగాఁ దగు నీకున్. 76

దొడ్డవాని కర్మననుసరించి లోకంబు వర్తించుట

గీ. శ్రేష్ఠుఁ డగునరుఁ డెద్దానిఁ జేయు దాని
నితరజనములు గావింతు రెల్లప్రొద్దు
నతఁడుగావించు నట్టిమర్యాద ననుస
రించి వర్తించు లోకంబు ప్రీతితోడ. 77

సీ. ముల్లోకములయందు మునుకొని నాకుఁ జే
యఁగఁ దగు కార్య మింతైన లేదు
పొందినయది లేదు పొంద నున్నది లేదు
కర మకర్ముఁడ నయ్యుఁ గర్మమందె

వర్తింపుచున్నాఁడ వరుసతో నేనప్ర
మాదుండనై కర్మమార్గమందుఁ
బూని ప్రవర్తింప నేని లోకంబెల్ల
ననిశంబు నామార్గ మనుసరించు
తే. నేర్పుతో నేను గర్మం బొనర్పకున్న
జగములన్నియు నశియించు సంకరమున
కవనిలోఁ గర్త నగుదు నే నందువలనఁ
బ్రజల నందఱఁ జంపినవాఁడ నగుదు. 78
గీ. ధరణి నాసక్తులై యవిద్వాంసు లెట్లు
కర్మమొనరింతు రట్లు జగద్ధితంబు
కొఱకు విద్వాంసుఁడును నిజకులసముచిత
కర్మమొనరించు నందు సంగంబు విడిచి. 79

కర్మాసక్తులైనవారికి బుద్ధి చెఱుపఁగూడదు

వ. మఱియు విద్వాంసుండగువాఁడు తాను సావధానుండై కర్మంబు లాచరింపుచు నొరుల నాచరించువారిఁగా నియోగింపవలయుం గాని కర్మమం దాసక్తులై సేయు నట్టి యజ్ఞులకైనను బుద్ధిభేదంబుపుట్టింపఁ దగదు. మఱియు మూఢాత్ముం డగువాఁ డహంకారంబునఁ బ్రకృతిగుణంబులచేత బహురూపంబులుగా నాచరింపంబడు కర్మంబులకేను గర్త నని తలంచుఁ దత్త్వవిదుం డగువాఁడు సత్త్వాదిగుణవిభాగంబు నందు గుణంబులు గుణంబులయం దావిర్భవించు ననిదలంచి యాసక్తుండుగాకయుండుఁ బ్రకృతిగుణంబులచే మోహితులై గుణంబుల యందుఁ గర్మంబునందు నాసక్తు లగుదు రేమియు నెఱుంగని మూఢజనంబుల సర్వజ్ఞుం డగువాఁడు చలింపఁ

జేయం దగదు వివేకివై నాయందు సర్వకర్మంబు లర్పణంబు
గావించి నిరాశుండవై మమత్వంబు విడిచి విగతసంతా
పుండవై యుద్ధంబుసేయు మని పలికి వెండియు నిట్లనియె. 80

ఇట్టివారు చెడుదురు

సీ. అనఘ శ్రద్ధావంతు లనసూయులైన యే
మనుజు లీనాదైనమతము నిత్య
మనుసరించి చరింతు రట్టి వారలుకర్మ
బంధవిముక్తులై పరఁగుచుందు
రవని నసూయకులై యెవ్వ రీనాదు
మతమును గైకొని మమతతోడ
వర్తింప లేరట్టివారలు కడు బుద్ధి
హీనులుగా జ్ఞానహీనులుగను
తే. వారు నష్టులైనవారుగా నెఱుఁగుము
జ్ఞానవంతుఁ డైనస్వప్రకృతికి
సదృశముగఁ జరించు సకలభూతములందుఁ
బ్రకృతి నిగ్రహంబు వలవ దెందు. 81
క. అనఘ ప్రతీంద్రియవిషయం
బున రాగద్వేషము లటు పూనుకయుండున్
వినువానికి లోఁబడఁ దగ
దనిశం బవి రెండు వైరు లగుఁ బురుషునకున్. 82

కులధర్మమే శ్రేష్ఠంబనుట

గీ. అనఘచరిత స్వనుష్ఠితంబైన యన్య
ధర్మమునకంటెఁ దనకులధర్మ మగుణ
మైనఁ గడు లెస్స తనధర్మమందు నిధన
మధిక మన్యధర్మంబు భయావహంబు. 83

వ. అనిన నర్జునుం డిట్లనియె.

క. ఈపురుషుం డిచ్ఛ లేకయె
ప్రాపుగ భువి దేనిచేతఁ బ్రసభంబుగనా
జ్ఞాపింపఁబడిన కైవడిఁ
బాపంబులు సేయు మాధవా వినఁదలఁతున్. 8

కామంబు సర్వదోషమూలం బనుట

చ. అన విని కృష్ణుఁ డిట్లనియె నర్జున చూడ రజోగుణంబునన్
జననమునొందెఁగామమదెచయ్యనఁగ్రోధముఁజూడఁగామహా
శన మతిపాపరూప మవిషహ్యము నిచ్చుట దీని వైరిఁగా
మనమునఁజూడు మిత్తెఱఁగు మానుగ నీకునెఱుంగఁజెప్పితిన్.

క. ధూమముచే ననలము క్రియ
నా మలినముచేత ముకుర మట్టుల గర్భం
బామాయచేతఁబోలెను
గామముచే జ్ఞాన మెల్లఁ గప్పంబడియెన్. 86

గీ. అనఘ కామరూపమనలంబు దుష్పూర
మాత్మవిదున కరియునైన యట్టి
కామముననుదెల్వి గప్పఁగఁబడుదాని
నిగ్రహింపవలయు నేర్పుతోడ. 87

గీ. ఇంద్రియంబులు బుద్ధియు హృదయ మెపుడు
కామమున కాశ్రయంబగుఁ గామ మింద్రి
యములచే నావరించి జ్ఞానమును దేహిఁ
బాయకెప్పుడు మోహింపఁ జేయుచుండు. 88

వ. కావున నీవు మొదల నింద్రియంబుల నియమించి జ్ఞానవిజ్ఞాన
నాశనంబును బాపస్వరూపంబైన యీ కామంబును జయిం

పుము మఱియు దేహంబుకంటె నింద్రియంబులు నింద్రియంబులకంటె మనంబు మనంబుకంటె బుద్ధియుఁ బరంబనియు బుద్ధికిఁ బరుఁ డెవ్వఁడో వాఁ డాత్మ యనియు నిట్లు బుద్ధికంటెఁ బరుండగునాత్మ నెఱింగి యాత్మను దనయాత్మ చేత లెస్సగా నిల్పి దురాసదమైన కామరూపశత్రువును జంపుమని యిట్లు తృతీయాధ్యాయంబునందుఁ గర్మయోగం బుపదేశించి భగవంతుండు వెండియు నర్జునున కిట్లనియె. 89

---

## చతుర్థాధ్యాయము - జ్ఞానయోగము

సీ. అనఘ యీ యోగంబు మును వివస్వంతున
కెఱిఁగించితి నతండు కరము ప్రీతి
మనువున కెఱిఁగించె మనువు సంప్రీతితో
నిక్ష్వాకునకుఁ జెప్పె నింపుమీఱ
రపిమీఱ నిట్లు పరంపరాసంప్రాప్త
మైన దీని నెఱిఁగి రఖిలనృపులు
గడుఁబెద్దగాలంబు గడచుటవలన నీ
యోగంబు ఖిలమయ్యె నుర్వియందు
తే. ననుపమం బీపురాతనమైనయోగ
మనఘ భక్తుండవు సఖుండవగుటఁ జేసి
నీకుఁ జెప్పితి నిప్పుడు నెమ్మితోడ
నిది కడురహస్య మెవ్వార లెఱుఁగ రిందు. 90
వ. అనిన నర్జునుం డిట్లనియె.
గీ. అనఘ నీవు పుట్టినట్టికాలము కొంచె
మినుఁడు పుట్టి పెక్కుదినము లయ్యెఁ

జెలఁగి యతని కేను జెప్పితి నంటి వీ
వెవ్విధమున దీని నెఱుఁగువాఁడ. 91

వ. అని యడిగిన వాసుదేవుం డిట్లనియె.

క. సువిచార నీకు నాకును
భువిలోపలఁ బెక్కుజన్మములు కడచనె నే
నవియన్ని యెఱిఁగి యుండుదుఁ
బ్రవిమలమతి నెఱుఁగ వీవు ప్రాజ్ఞత లేమిన్. 92

ధర్మసంస్థాపనకై భగవంతుండు పుట్టు ననుట

గీ. అవ్యయాత్ముండనయ్యు నే నజుఁడనయ్యు
భూతముల కీశ్వరుఁడనయ్యు భువి స్వకీయ
మైన ప్రకృతిని దగబొంది మానితముగ
నాత్మమాయచే సారెకు నవతరింతు.

క. ఎప్పు డెపుడు ధర్మమున కిల
నుపహతియు నధర్మమునకు నుపచయ మగు నే
నపుడెల్ల నవతరింపుదు
విపులక్ నిజమాయచేత వీరవరేణ్యా. 93

క. విను పార్థ సాధురక్షణ
మును దుష్కృతిజనవినాశమును ధర్మస్థా
పనమును గావించుటకై
పనివడియే నవతరింతుఁ బ్రతియుగమందున్. 95

గీ. మఱియు దివ్య మయిన మజ్జన్మకర్మంబు
నిట్లు తత్త్వబుద్ధి నెవ్వఁ డెఱుఁగు
నతఁడు మేను విడిచి యవ్వల జన్మంబు
నొందఁ డుర్వి నన్నుఁ బొందు ననఘ. 96

ఉ. రాగముక్రోధముఁ భయము గ్రక్కునఁబోనిడిమత్స్వరూపులై
బాగుగనన్ను సంతత ముపాసనచేయుచు నిష్కళంకులై
యోగులు జ్ఞానయోగమున నుర్వి ననేకులు పూతచిత్తులై
వేగమె నాదుభావమును విశ్రుతభంగి గమించి రర్జునా. 97

చ. తడయక యెవ్వ రెట్లు వితతంబుగ నన్ను భజింతురట్లు నే
నుడుగక వారి నందఱ సముత్సుకతఁ గరుణింతు నెప్పుడుఁ
బుడమి సమస్తమానవులు పోఁడిమితోడ మదీయమార్గముఁ
విడువక సంచరించెదరు వీరవరేణ్య సమస్తభంగులన్. 98

చ. నలువుగ నిమ్మనుష్యభువనంబున మానవకోటి కెంతయుఁ
జెలువుగఁ గర్మసిద్ధి బలుశీఘ్రమునఁ లభియించుఁ గావునఁ
దలఁగక కర్మసిద్ధిని మనంబునఁ గోరుచు నిర్మలాత్ములై
పొలుపుగ సర్వదేవతలఁ బూజ యొనర్పఁగఁ బోలు నర్జునా.

చ. ఘనతరయుక్తి నేను గుణకర్మవిభాగముచే ధరిత్రిలోఁ
బనివడి నాల్గువర్ణములవారి సృజించితి దాని కెంతయుఁ
మునుకొని కర్తనై సకలము న్వెలిఁగించెదు నన్నకర్తగా
ఘనముగనవ్యయాత్మకునిగాఁగ నెఱుంగుము పాండునందనా.

క. కర్మంబులు నన్నంటవు
కర్మఫలం బందుఁ గాంక్ష గలుగదు నాకి
ట్లర్మిలి ననుఁ గనుపురుషుఁడు
కర్మంబులఁ గట్టఁబడఁడు కౌరవముఖ్యా. 101

గీ. ఈగతి నెఱింగి పూర్వికులెల్లమోక్ష
కాములయ్యును జేసిరి కర్మచయము
గాననీవును బూర్వులకరణిఁ దెలిసి
చెలఁగి ప్రాచీనకర్మంబు సేయు మనఘ. 102

కర్మాకర్మవికర్మస్వరూపము

గీ. కర్మ మెయ్యది మఱియు నకర్మ మెద్ది
యనుచుఁ గవులును మోహితులైరి గాన
నెద్ది దెలిసిన నశుభంబులెల్లఁ దొలఁగు
నట్టికర్మంబు నెఱిఁగింతు ననఘ వినుము. 103

క. కర్మము నిషిద్ధకర్మము
కర్మాభావంబు దెలియఁగాఁ దగు నెపుడుఙ్
గర్మగతి గహన మందుకు
నిర్మలమతిఁ దత్త్వ మనుచు నెఱిఁ గనవలయున్. 104

సీ. అవని నెవ్వఁడు కర్మమందుఁ గర్మాభావ
మరయఁ గర్మాభావమందుఁ గర్మ
మునుజూచు నాతఁడు మనుజులలోఁ గడు
బుద్ధిమంతుఁడు వాఁడె పూర్ణయోగి
యతఁడె కర్మములన్ని యాచరించినవాఁడు
మఱియు నెవ్వాని కర్మంబు లన్ని
ఘనతర కామసంకల్పవర్జితములై
యలరారు నతని జ్ఞానాగ్నిదగ్ధ

తే. కర్ముఁడైన విద్వాంసునిగాఁ గణింతు
రార్యులు ఫలార్థిగాక నిరాశ్రయుండు
నిత్యతృప్తుఁడై యెవ్వాఁడునిలుచు నతఁడు
చేసియును గర్మ మింతైన జేయకుండు. 105

గీ. ఆశ విడిచి మనోబుద్ధు లాఁగిపట్టి
వీతసర్వపరిగ్రహుండై తనర్చు

యోగియు శరీరమాత్రోపయోగకర్మ
మది యొనర్చియుఁ దాఁబొందఁ డఘము లనఘ. 106

వ. మఱియు నమ్మహాత్ముండు యదృచ్ఛాలాభసంతుష్టుండై సుఖ
దుఃఖశీతోష్ణాదిద్వంద్వాతీతుండై వీతమత్సరుండై సిద్ధ్య
సిద్ధులందు సముండై కర్మంబు గావించియు బద్ధుండు గాక
యుండు బరిత్యక్తసంగుండై ముక్తుండై జ్ఞానప్రతిష్ఠచిత్తుండై
యజ్ఞంబుకొఱకుఁ జేయుచున్నవానికర్మంబు బంధహేతువు
గాక నశించు. 107

ఉ. బ్రహ్మమె హోమసాధనము బ్రహ్మమెచూడహవిష్పదార్థముల్
బ్రహ్మముచేత బ్రహ్మమనుపావకునం దటువేల్వఁగాఁ బడుల్
బ్రహ్మమయోక్తకర్మము సమాధిగఁ గైకొనునట్టిబ్రహ్మచే
బ్రహ్మమె పొందశక్యమగు బ్రహ్మమె సర్వము వేఱెయున్న దే.

యోగులు చేయు ద్రవ్యయజ్ఞజ్ఞానయజ్ఞములు

క. ధరలోఁ గొందఱు యోగులు
కర మొప్పగ దైవమఖముగావింతురు కొం
దఱు యజ్ఞముచే యజ్ఞము
వెరవున బ్రహ్మాగ్నియందు వేల్తురు విజయా. 109

క. కొందఱు శ్రవణాదీంద్రియ
బృందము నియమాగ్నులందు వేల్తురు మఱియుం
గొందఱు శబ్దాదివిషయ
బృందము కరణాగ్నులందు వేల్తురు పార్థా. 110

గీ. గరిమతోఁ గొందఱింద్రియకర్మములను
గడిమిఁ జలనాదికప్రాణకర్మములను

జ్ఞానదీపితచిత్తనిగ్రహ మనియెడి
యోగవహ్నిలో వేల్తురు యోగివర్య. 111

గీ. అవనిలో సంశితవ్రతు లైనయట్టి
యతులు ద్రవ్యయజ్ఞులు తపోయజ్ఞులు శ్రుతి
యజ్ఞులును జ్ఞానయజ్ఞులునట్లు యోగ
యజ్ఞులన నొప్పుదురు కౌరవాగ్రగణ్య. 112

వ. మఱియుఁ గొందఱు ప్రాణాయామపరాయణులైనయభ్యాస యోగులు ప్రాణాపానంబులగతి నిరోధించి ప్రాణవృత్తియం దపానంబును నపానవృత్తియందుఁ బ్రాణంబును లయంబు నొందింతు రదియునుంగాక కొందఱు నియతిపరులై ప్రాణం బులు ప్రాణంబులయందె హోమంబు గావింతురు నాచేత జెప్పంబడిన వీరందఱు యజ్ఞక్షాళితకర్ములై యజ్ఞకోవిదు లని వక్కాణింపం బడుదురు. యజ్ఞశిష్టామృతంబు భుజించిన వారలు సనాతనం బైన బ్రహ్మపదంబు బ్రాపింతురు. యజ్ఞంబు లేనివాని కిహపరంబులు రెండును లేవు. వేదముఖంబునందు నివ్విధంబునబహుయజ్ఞంబులువిస్తరింపంబడియె. వీనినన్నింటి గర్మంబువలనం బుట్టినవానిఁగా నెఱుంగు మట్లెఱింగిన నీవు బంధవిముక్తుండ వగుదువు సమస్తకర్మంబును నాశంబు నొంద నిదై జ్ఞానంబునందుఁ బరిసమాప్తి నొందుఁ గావున ద్రవ్య యజ్ఞంబుకంటె జ్ఞానయజ్ఞం బుత్తమంబై యుండు.

ఆచార్యునియొద్ద జ్ఞానోపదేశంబు చేసికొనుట

గీ. తత్త్వవేత్తలైనధన్యులు నీకెద్ది
గఱపుదురు నితాంతకరుణ నట్టి

జ్ఞాన మెఱుఁగు మీవు కడుభక్తి సంప్రశ్న
చేత వినతిచేత సేవచేత. 114

గీ. మఱియు నేజ్ఞానము నెఱింగి మరల నీవు
తవిలి మోహంబునొందవు దానిచేత
నాత్మనైనట్టి నాయందు నఖిలభూత
వితతిఁ జూచెద వెంతయు వీరవర్య. 115

క. పాపులకంటెను మిక్కిలి
పాపుఁడవైనను వివేకబంధురతరిచేఁ
బాపాంబుధిఁ దరియించి య
పాపుఁడ వయ్యెదవు నీవు పాండుకుమారా. 116

క. అనఘా మండెడు శిఖి వే
ల్చినయింధనములను నీఱుఁ జేసినమాడ్కిన్
మునుకొని కర్మచయంబుల
ఘనముగ జ్ఞానాగ్ని నీఱు గావించు భువిన్. 117

క. జ్ఞానముతోడ సమానం
బైన పవిత్రమగువస్తువది లేదు మహిన్
బూనుకొని యోగసిద్ధుఁడు
దానింగను నాత్మయందె తగుకాలమునన్. 113

క. జ్ఞానాసక్తుం డింద్రియ
మానసముల నాఁగి శ్రద్ధ మల్లడిగొన సు
జ్ఞానమును బడయు నవ్వల
జ్ఞానముచేఁ జిత్తశాంతిగలుగు నతనికిన్. 119

సంశయాత్మాదులు చెడుదురనుట

గీ. జగతి నశ్రద్ధధానుఁడు సంశయాత్ముఁ
డజ్ఞుఁడు నశించు మరి సంశయాత్మునకును
బరఁగ నీలోకమును లేదు పరము లేదు
సుఖము లేదు నిక్కం బిది సూరివినుత. 120

గీ. జ్ఞానసంచ్ఛిన్నసంశయుండై నితాంత
యోగసన్న్యస్తకర్ముఁడై యొప్పువాని
నాత్మవంతునిఁ గర్మచయంబు లవని
బద్ధునిగఁ జేయఁజాలవు పాండవేయ. 121

గీ. కానఁ బాండుకుమార నీమానసమునఁ
బాదుకొని యున్న యజ్ఞానభవదురంత
సంశయమును జ్ఞానాసిచేఁ జక్కఁ జేసి
యోగయుక్తుఁడవై లెమ్ము యుద్ధమునకు. 122

## పంచమాధ్యాయము, కర్మసన్న్యాసయోగము

వ. అని యిట్లు చతుర్థాధ్యాయంబునందు జ్ఞానయోగం బుపదే
శించి పదపడి జ్ఞానయోగం బుపదేశించితి రీరెంటిలోన
నెయ్యది శ్రేయస్సాధకం బగు దాని నొక్కటి నిశ్చయించి
యానతిమ్మని యడిగినఁ గృష్ణుం డిట్లనియె. 123

సీ. అనఘాత్మసన్న్యాసమును గర్మయోగంబు
రెండును శుభము లా రెంటిలోన
సన్న్యాసమునకంటెఁ జర్చింపఁ గర్మయో
గం బది యెక్కుడై గ్రాలుచుండు

నెవ్వఁడు కాంక్షింపఁ డెవ్వఁడు ద్వేషింపఁ
డాతఁడు నిత్యసన్న్యాసి యగును
అతఁడు నిర్ద్వంద్వుఁడై యత్యంత సుఖముగా
బంధంబుచే విడివడి దొలంగు.

తే. వినుము సాంఖ్యయోగంబులు భిన్నములుగ
బాలురు వచింతు రిబ్భంగిఁ బండితులు వ
చింప రందొక్కటియు నభ్యసించెనేని
ప్రీతితోఁ బొందుమనుజుఁ డా రెంటిఫలము. 124

గీ. పరఁగ సాంఖ్యులచేత నేపదము పొందఁ
బడు నదియె యోగములచేతఁ బడయవచ్చు
నొనర సాంఖ్యయోగములలో నొక్కదానిఁ
జూచు నాతఁడు రెంటిని జూచు ననఘ. 125

క. యోగంబులేక నరునకు
బాగుగ సన్న్యాససిద్ధి వడయఁగ రాదా
యోగసమన్వితుఁ డగుముని
వేగమె బ్రహ్మంబు నొందు వీరవరేణ్యా. 126

వ. మఱియు యోగయుక్తుం డగుపురుషుండు పరిశుద్ధచిత్తుండై నియమితమనస్కుండై జితేంద్రియుండై సర్వభూతంబుల కాత్మభూతం బయినయాత్మకలవాఁడై యుండు. నతండు కర్మంబుగావించియు దాని నంటకుండు. 127

సీ. వినవయ్య తత్త్వకోవిదుఁ డైన పురుషుండు
వినుచు స్పృశింపుచుఁ గనుచు మూరు
కొనుచు భక్షింపుచుఁ జనుచుఁ నిద్రింపుచు
నూర్పులువుచ్చుచు నేర్పుఁ మీఱఁ

బలుకుచు విడుచుచు వడి గ్రహింపుచుఁ
గనులు మూయుచు విప్పుచు పొసఁగ నగుచు
నిట్లున్న వాఁడయ్యు నింద్రియంబులు నింద్రి
యార్థంబులం దున్నవని యెఱింగి

తే. తాను గావింప లేదని దలఁచుచుండుఁ
బొత్తు విడిచి బ్రహ్మార్పణబుద్ధిచేతఁ
గర్మము లొనర్చి యఘముచేఁ గలిసికొనఁడు
వనజము జలంబుచేఁ గూడుకొననియట్లు.

గీ. సొరిది యోగులు చిత్తసంశుద్ధికొఱకు
సంగమును వీడి యింద్రియచయముచేత
ధీమనఃకాయములచేతఁ దెలిసి సర్వ
కర్మములొనర్చుదురు ఫలకాంక్ష లేక.

గీ. యోగి కృతకర్మఫలపరిత్యాగి యగుచు
నవని నైష్ఠికి యగు శాంతినధిగమించు
యోగిగాని నరుండు ఫలోపభోగ
సక్తుఁడయి కట్టుపడుఁ గామచారి యగుట.

క. అనయ నవద్వారపుర
స్వరూప మగు దేహమందు వశి కర్మములన్
గురుమతి విడిచి యొనర్పక
యొరులం బనుపక వసించి యుండు సుఖముగాన్.

క. తలఁప విభుఁడు లోకమునకుఁ
బలుమఱు కర్మములు కర్మఫలయోగంబుల్
దిలకింపఁగఁ గర్తృత్వము
గలిగింపం డిది స్వభావగతి వర్తిల్లున్.

గీ. పొసఁగ నీశ్వరుఁ డెవ్వని పుణ్యమును గ్ర
హింపఁ డెవ్వని యఘము గ్రహింపఁ డెందు
జ్ఞాన మజ్ఞానమునఁ జాలఁ గప్పఁబడియె
దాన మోహితు లౌదురు ధరణిజనులు. 133

వ. మఱియు నాయాత్మజ్ఞానంబుచేత నయ్యజ్ఞానం బెవ్వారికి నశింపఁ
జేయంబడు నట్టివానిజ్ఞానంబు వానికంటెఁ బరుండగువాని
సూర్యుండునుబోలెఁ బ్రకాశింపంజేయుజ్ఞానంబుచేత నిర్ధూత
పాపు లగుపురుషులు బ్రహ్మార్పితబుద్ధులై బ్రహ్మస్వరూపులై
బ్రహ్మనిష్ఠులై బ్రహ్మాశ్రయులై పునరావృత్తిరహితశాశ్వత
పదంబు నధిగమింతురు మఱియు. 134

చ. వినయము విద్యయుం గలుగువిప్రవరేణ్యునియందు గోవునం
దనవరతంబు సామజమునందును శ్వానమునందు శ్వానముం
దిని యెడువానియందు సమదృష్టిగఁ జూతురు పండితోత్తముల్
పనివడి సర్వజంతువులు బ్రహ్మమయం బను తెల్వి చేఁ దగన్.

చ. నలువుగ నేమహాత్ముగమనంబు సమత్వమునొందియుండు ని
శ్చలముగ వారిచే మిగుల సంసరణంబు వినిర్జితం బగున్
దొలఁగక బ్రహ్మమున్ సమము దోషవిహీనము గావునన్ సము
జ్జ్వలగతి బ్రహ్మమందె వరుసన్ వసియింతురు వార లర్జునా.

గీ. అనఘ స్థిరబుద్ధి గలిగి మోహంబు లేని
బ్రహ్మవిదుఁ డనవరతంబు బ్రహ్మమందె
యుండి ప్రియమందియును ముద మందఁ డెపుడుఁ
గినిసి యప్రియ మొంది దుఃఖింపఁ డెందు. 137

గీ. అవని నేపురుషుండు బాహ్యవిషయముల
యందనాసక్తచిత్తుఁడై యాత్మసుఖము

నొందు నాపురుషుఁడు బ్రహ్మయోగయుక్త
చిత్తుఁడై యక్షయసుఖంబుఁ జెందుననఘ. 138

వ. ధనంజయా! యేభోగంబులు సంబంధజాతంబులై యాద్యంతంబులు గల్గియుండునట్టిభోగంబులు దుఃఖహేతువు లనంబడు యస్థిరంబులగు భోగంబులందు విద్వాంసుం డగువాఁడాసక్తుండు గాఁడు మఱియు నెవ్వాఁడు శరీరమోక్షంబుకంటె ము న్నీలోకంబునందే కామక్రోధంబులవలనం బుట్టినవేగంబు సహించుటకు సమర్థుం డగునతండె యోగంబుగలవాఁడు నతండె సుఖంబుగలవాఁడై ప్రకాశించు. 139

గీ. ఎవ్వఁ డాత్మశర్ముఁ డెవ్వఁ డాత్మారాముఁ
డెవ్వఁ డాత్మయందె యెపుడు వెలుఁగు
నట్టియోగి బ్రహ్మమై బ్రహ్మ సుఖమును
బొందు సతతంబు పురుషవర్య. 140

సీ. సంక్షీణకలుషులు సంశయరహితులు
సంయతచిత్తులు సర్వభూత
హితకాము లగుమును లతులిత బ్రహ్మని
ర్వాణంబు గాంతురు వరుసతోడ
మఱియుఁ గామక్రోధవిరహితులును నియ
తాత్ములు మరి విదితాత్ములైన
యతులకు నుత్తమం బైన బ్రహ్మసుఖంబు
ప్రాప్తించు సర్వస్థలంబులందు
తే. బాహ్యవిషయంబులను బట్టి బయలఁ ద్రోచి
దృష్టి భ్రూమధ్యమునఁ దొల్గనీక నిలిపి

నాసికామధ్యమందుఁ బ్రాణము నపాన
మును దిరుగునట్లుగా సమములుగఁ జేసి. 141

క. నియతమనోనిలబుద్ధిం
ద్రియుఁడు గతద్వేషరాగతృష్ణుఁడు మోక్షా
శ్రయుఁడు నగుమునివరుఁడు త
ద్దయు ధాత్రి వెలుంగునటు సదాముక్తుండై. 142

క. నను యజ్ఞతపఃఫలభో
క్తనుగా మఱి సర్వభూతగణసుహృదునిఁ గాఁ
గనుసర్వజగములకునా
థునిఁగా మది నెఱిఁగి పొందుదురు శాంతి నొగిన్. 143

వ. అనియిట్లు పంచమాధ్యాయంబునందుఁ గర్మసన్న్యాసయోగం
బుపదేశించి భగవంతుండు వెండియు నిట్లనియె. 144

## షష్ఠాధ్యాయము, ఆత్మసంయమయోగము

గీ. కర్మఫలముపై మనమునఁ గాంక్షలేక
సేయదగినకర్మంబును జేయు నెవ్వఁ
డతఁడె సన్న్యాసి యోగియు నతఁ డనగ్ని
గాఁడతఁ డవిక్రియుండును గాఁడు పార్థ. 145

గీ. జగతి నెద్దాని సన్న్యాసముగ నొడువుదు
రదియె యోగంబుగ నెఱుంగు మనఘ నేర్పు
కలిమి న్యస్తసంకల్పుఁడు గానివాఁడు
యోగిగాఁ డొక్కరుండును యోగిశీల. 146

సీ. కురువర్య యారురుక్షుండగుమునికిఁ గ
ర్మంబును యోగకారణ మనియెద

పట్టి యోగారూఢుఁ డైనవానికె శమం
బది కారణం బని యాత్మవిదులు
చెప్పుదు రెప్పుడు చెలఁగి యింద్రియవిష
యములందుఁ గర్మంబులందు మిగుల
నాసక్తిలేనివాఁ డగునప్పుడఖిల సం
కల్పసన్న్యాసి యోగ ప్రవిష్టుఁ
తే. డగుమఱియు నాత్మకు మనంబె దగినబంధుఁ
డాత్మకు మనంబె పరిపంథి యట్లుగాన
మనముచే నాత్మ నుద్ధరింపంగ వలయు
నాత్మ నెప్పుడు క్రిందు సేయంగఁ దగదు. 147
గీ. పరవి నేయాత్మచే మానసంబు విజిత
మయ్యె నయ్యాత్మకు మనంబె యరయ హితుఁడు
బాగుగ ననాత్మ కొగి శత్రుభావమందు
మనమె పరిపంథివలెఁ దోచు మనుజవర్య. 148

యోగాభ్యాసలక్షణము

వ. మఱియు విజితమానసుఁడై యుపరతి నొందినవానికి శీతో
ష్ణంబులందును సుఖదుఃఖంబులందును మానావమానంబులం
దును బరమాత్మ స్వస్థుండయి యుండు జ్ఞానవిజ్ఞానతుష్టమాన
సుండయి నిశ్చలుండును విజితేంద్రియుండును లోష్టకాంచన
పాషాణంబుల సమదృష్టిం జూచు యోగి యుక్తుం డనంబడు
మఱియు నుపకారియందు మిత్రునియందు శత్రువునియందు
సమునియందు మధ్యస్థునియందు ద్వేషులయందు బంధువుల
యందు నార్యులయందుఁ బాపజనంబులందు సమబుద్ధి యెవ్వా
నికిం గలుగు నతండె శ్రేష్ఠుండు. ఎవ్వండేని యేకాకియై నియ

మింపంబడిన చిత్తంబును శరీరంబునుంగలవాఁడయినిరపేక్షుం డయి పరిగ్రహంబులేక గిరిగుహాద్యేకాంతస్థితుం డగుచు నాయోగి సర్వప్రకారంబుల నాత్మానుసంధానంబు సేయవలయు. 149

సీ. వినుము కౌంతేయ వివిక్తదేశంబునఁ
గడు మిట్టుపల్లును గలుగకుండఁ
జెలఁగి కుశాజినచేలంబులను దన
కాసనం బొనరించి యందు నియత
మానసేంద్రియుఁడై సమాహితచిత్తుఁడై
కాయంబు శిరమును గళము గదల
కుండఁ జక్కఁగ నిల్చి యొప్పుగా దిక్కులు
గనక నాసాగ్రభాగంబునందుఁ జూపు
ఆ. నిల్పి చిత్తశుద్ధికొఱకు యోగ
మభ్యసింపవలయు నాత్మవిదుఁడు
యోగ మభ్యసించు యోగికి నింద్రియ
మానసములు వశము లైనటించు. 150

క. గతభయుఁడై మత్పరుఁడై
చతురుండై మఱియు బ్రహ్మచారివ్రతసం
స్థితుఁడయి మన్మానసుఁ డగు
యతిచిత్తోపరతిగలిగి యలరుఁ గిరీటీ. 151

గీ. ఇట్టి నియమింపఁబడినట్టి హృదయము గల
చతురుఁ డాత్మనుగూడి మత్స్థానమైన
మోక్షపదముఁ బ్రాపించి యమోఘమైన
శాంతిగలిగి ప్రకాశించు సంతతంబు. 152

గీ. వెక్కసంబుగ నన్నంబు మెక్కువాని
కనఘ యొక్కింత యైనను దినని వాని
కెపుడు నిద్రించువానికి నెపుడు లేచి
యుండు వానికిఁ గలుగ దీయోగసిద్ధి. 153

క. యుక్తాహారునకును మఱి
యుక్తవిహారునకుఁ గర్మయుక్తగతునకున్
యుక్తావబోధునకుఁ దగ
యుక్తస్వప్నునకుఁ గల్గు యోగము వత్సా. 154

గీ. ఎపుడు నియమింపఁబడినసర్వేంద్రియములు
మానసముగలవాఁ డగుమనుజుఁ డపుడు
కరము సర్వకామములందుఁ గాంక్ష లేని
యోగి యని చెప్పఁబడుఁబురుహూతతనయ. 155

చ. చెలువుగ నింద్రియంబులను జిత్తము నిట్టటు వోవ నీక నే
ర్పలరఁగ నడ్డగించి నయ మారఁగ నాత్మసమాధియుక్తుఁడై
చెలఁగెడు యోగి నిశ్చలతఁ జెందు నివాతగతోరుదీపమ
ట్లలవడ నిస్తరంగ మగునబ్ధివిధంబునఁ బాండవోత్తమా.

గీ. చెలఁగి యెచట యోగసేవచేత నిరోధ
మొంది యున్న చిత్త ముపరమించు
నచట బుద్ధిచేత నాత్మను జూచుచు
నాత్మయందె యోగిహర్ష మెందు. 157

గీ. అతఁడు తత్త్వంబుచే నాత్మయందె యుండి
యించుకైనఁ జలింప కతీంద్రియంబు
శేముషీగ్రాహ్య మగుయోగసిద్ధిజాత
పరమసుఖమును బ్రాపించుఁ బాండవేయ. 158

గీ. యోగి యీసుఖలాభంబు నొంది యింత
కంటె నధికలాభం బొండు గల దటంచుఁ
దలఁపఁ డా యోగమందుండి తత్త్వవిదుఁడు
దుఃఖములచేత నించుక త్రొట్రుపడఁడు. 159

గీ. ఒనర దుఃఖసంబంధవియుక్తమయిన
యోగసంజ్ఞిత మగు దాని నొగి నెఱుఁగుము
మహి సనిశ్చయమగు దుఃఖరహితచిత్త
గతిని గూర్పంగవలయు యోగంబు పార్థ. 160

సీ. సంకల్పసంభవసకలకామంబుల
వడి నశేషంబుగా విడిచిమాన
సమునఁ దదింద్రియసమితి నెల్లెడలని
ర్బంధించి ధారణాబలగృహీత
బుద్ధిచే మనమును బొందుగా నాత్మయం
దనవరతము నిల్పి యాత్మవిదుఁడు
క్రమముతో నుపరతి గాంచఁగ వలయు నొ
క్కించుక మదిని జింతించవలదు

తే. చలన మస్థిర మగుమానసంబు దేని
దేనివలనఁ జలింపుచుఁ దిరుగుడువడు
దానివలనను నియమించి మానసంబు
నాత్మవశమును జేయంగ నగుఁ గిరీటి. 161

చ. పరఁగఁ బ్రశాంతమానసుఁడు బ్రహ్మమయుండు ప్రశాంత
రాజసుం, డరయ నకల్మషుం డగుమహాత్ముఁ డబ్బు నితాంత
సౌఖ్యమి, త్తెఱఁగునఁ జిత్త మెప్పుడు గవెంపుచు యోగి

వినష్టపాపుఁడై, బరువడి భూరియోగమునఁ బ్రహ్మసుఖంబును
బొందు నెంతయున్. 162

గీ. అనఘ యంతట సమదర్శి యైనయోగి
యాత్మ సర్వభూతంబుల నాత్మ నఖిల
భూతములయందుఁ గనుఁగొను బుద్ధిచేత
నట్టి వానికి భేదమింతైనఁ గలదె. 163

గీ. అరయ నాయందు సర్వంబు నట్లుసర్వ
మందు నన్ను విలోకించు నట్టిపరమ
సూక్ష్మదృష్టికి నేఁబరోక్షుండఁ గాను
వాఁడు నాకుఁ బరోక్షుండుగాఁడు పార్థ. 164

క. ఏకత్వమొంది యెవ్వఁడు
చేకొని నను సర్వగతు భజించు నతఁ డిలన్
వీక బహుగతులఁ దిరుగుచుఁ
దేకువనాయందె యుండు ధీరవరేణ్యా. 165

గీ. ఘనత సుఖమునుగాని దుఃఖమునుగాని
యాత్మసామ్యంబుచే సమమైన యటులఁ
బరఁగ నెవ్వఁడు గాంచు నాపురుషుఁ డరయ
నతిశయుండును మఱియు సమ్మతుఁడు పార్థ. 166

వ. అనిన నర్జునుం డిట్లనియె. 167

చ. పనివడి మీర లాత్మసమభావమునం దిపు డర్థి నానతి
చ్చిన ఘనయోగమందు మది చిక్కదు చంచల మౌటచేత నె
మ్మన మతిచంచలంబు బలవంతముగావున దాని వేగముం
మునుకొని వాయువేగమున బోలె సుదుష్కరమడ్డగింపఁగన్.

వ. దాని నెత్తెఱంగున నిగ్రహింపవచ్చు నెఱింగింపుమని యడి
గిన భగవంతుం డిట్లనియె. 169

## మనోనిగ్రహోపాయము

సీ. పాండునందన నీవు పల్కినచందాన
హృదయంబు చలము దుర్నిగ్రహంబు
సంశయ మదిలేదు సాంద్రవైరాగ్యంబు
చేత నభ్యాసంబుచేతఁ గట్టు
వడిఁ జిత్తసంశుద్ధి వడయనివానికిఁ
దొడరి యోగము కడు దుర్లభంబు
వశ్యమానసుఁ డైనవాని కుపాయంబు
వలన సుఖంబుగాఁ బడయవచ్చు
ననిన నర్జునుఁ డనియె మహాత్మ శ్రద్ధ
గలిగియును యోగపరినిష్ఠవలనఁ జలిత
చిత్తుఁ డగువాఁడు యోగసంసిద్ధి వడయ
కేగతిని బొందుఁ గరుణతో నెఱుఁగఁ జెప్పుమ. 170

## యోగభ్రష్టునికిఁ గల్గుగతి

గీ. బ్రహ్మమార్గవిమూఢుఁడై పరఁగ నుభయ
మార్గవిభ్రష్టుఁ డైనట్టిమనుజుఁ డెప్పు
డాశ్రయములేక ఛిన్నాభ్ర మట్లు నాశ
మొందఁడే దీనిలెఱుఁ గెట్లు నందతనయ. 171

వ. దేవా నామనంబునం బొడమినయీసంశయం బంతయు నివా
రింప నీవే సమర్థుండవు నీకంటె నన్యుండు లేఁ డని పలికిన
నాభగవంతుం డిట్లనియె. 172

గీ. ఘనత నెవ్వాఁడు కళ్యాణకారి యగుచు
నరయ దుర్గతి నొందక యలరు నట్టి
పురుషుఁ డిహమందుఁ బరమందుఁ బూజ్యుఁ డగుచు
నాశనము నొందఁ డెన్నఁడు నయచరిత్ర. 173

గీ. అనఘచరిత యోగభ్రష్టుఁ డైనవాఁడు
పుణ్యకారులలోకముల్ పొంది యందుఁ
బెక్కువర్షముల్ సుఖియించి పిదప విమలు
లైన శ్రీమంతుల గృహంబులందుఁ బుట్టు. 174

క. మఱి యట్లుగాక యుండిన
నొరపుగ ధీమంతు లైన యోగులయింటన్
గులుతుగ జనించు ధరనీ
పరజన్మము చాల దుర్లభముగద పార్థా. 175

గీ. అట్లు జన్మించి తనపూర్వ మగుశరీర
బుద్ధిసంబంధ మంతలోఁ బొంది మఱల
నతఁడు సంసిద్ధికొఱకునై యాత్మలోన
యత్నమును జేయుఁ బరమాత్మ నధిగమింప. 176

గీ. ఇట్లు జన్మించి పూర్వదైహికవిశేష
బుద్ధిసంయోగమును బొంది పురుషవరుఁడు
చెలఁగి తనపూర్వయోగ సంసిద్ధికొఱకు
యత్న మొనరించు నధిక ప్రయత్న మలర. 177

వ. మఱియు నతం డస్వాధీనుండై నను బూర్వజన్మకృతయోగా భ్యాసబలంబుచేత నే గ్రమ్మరింపంబడు. యోగంబు నెఱుఁగ నిచ్ఛయించినపురుషుండు వేదంబు నతిక్రమించు, యోగి మిక్కిలి ప్రయత్నంబువలన యత్నంబు సేయుచున్న వాఁడై

యనేకజన్మసంసిద్ధుండై పిమ్మటఁ బరమగతిం బ్రాపించు. తపంబు సేయువారికంటె జ్ఞానంబుగలవారికంటెఁ గర్మంబులు సేయువారి కంటె యోగి యధికుండు గావున నీవు యోగివి గమ్ము. ఎవ్వండు శ్రద్ధావంతుండై మద్గతంబైన చిత్తంబు చేత నన్ను భజించు నతండు సర్వయోగులలో నధికుండై నాకు సమ్మతుం డగు నని యిట్లు షష్ఠాధ్యాయంబునం దభ్యాసయోగం బుపదేశించి వెండియు నిట్లనియె. 178

## విజ్ఞానయోగము, సప్తమాధ్యాయము.

సీ. అనఘ నాయందు సమాసక్తి గలవాఁడ
వై మదాశ్రయుఁడవై యచలయోగ
మధిగమించి యసంశయంబుగ నన్నెట్లు
దెలియుదు వబ్బంగి దేటపఱతు
నెద్దాని సర్వంబు నెఱిఁగినయవ్వల
నెఱుఁగంగఁ దగిన దొక్కింతయైనఁ
గలుగఁ బో దట్టి విజ్ఞానయుక్తంబైన
యీజ్ఞాన మెఱిఁగింతు నింపుతోడ
నెలమిమర్త్యులలోన వేయింటి కొకఁడు
సిద్ధికొఱకుఁ బ్రయత్నంబు సేయు నందుఁ
జెలఁగి వేయింటి కొక్కఁడు సిద్ధినొందు
నెఱుఁగు నసువారిలోన వేయింటి కొకఁడు. 179




క. ఇలయును సలిలము వహ్నియుఁ
బొలుపుగ మారుతము నభము బుద్ధియు మనముల్

దలఁప నహంకారం బని
వెలయఁగ మత్ప్రకృతి యష్టవిధమై యుండున్. 180

గీ. ఇదియుఁ జాల నపర యింతకంటెఁ బరంబు
క్షేత్రమును సమస్తజీవభూత
మగుచు నాదుప్రకృతి యలరు నెద్దానిచేఁ
దవిలి యీజగంబు దాల్పఁబడియె. 181

పరవస్తునిరూపణము

సీ. శక్రకుమార యీసర్వభూతములకు
నిదియె కారణ మని యెఱుఁగు మీవు
చర్చింప నబ్భంగి సర్వలోకమునకుఁ
బ్రభవంబు నేనట్లు ప్రళయ మేను
గణుతింప నిందు నాకంటె నొక్కింతైన
నుత్తమవస్తువొం డొకటి లేదు
సర్వంబు నాయందు సరిగూర్పఁబడియుండు
మహితసూత్రమునందు మణులువోలె

తే. జలములందు రసం బేను జంద్రసూర్యు
లందు రుచి నేను వేదంబులందుఁ బ్రణవ
మేను నభమందుఁ గలశబ్ద మేను బురుషు
లందుఁ బౌరుష మేను వీరాగ్రగణ్య. 182

గీ. భూమియందుఁ గలుగుపుణ్యగంధం బేను
దెలియ వహ్నియందుఁ దేజ మేను
ప్రాణి కోటియందు బ్రతు కేను జర్చింప
ధరణిఁ దపసులందుఁ దపము నేను. 183

చ. ఎలమి సమస్తభూతముల కేను సనాతనమైనజీవముఙా
బొలుపుగ బుద్ధిమత్తరుల బుద్ధియుఁ దేజము గల్గువారి ని
శ్చలమగుతేజ మేను మరిసత్త్వముగల్గినవారిలోపలఙా
వలనుగఁ గామరాగపరివర్జితసత్త్వము నేను ఫల్గునా. 184

క. పొందుగ సమస్తభూతము
లందును ధర్మావిరుద్ధ మగుకామము నే
నందురు తత్త్వజ్ఞులు సం
క్రందనసుత యిట్లు నన్నుఁ గనుఁగొను మీవున్. 185

క. ఇలలో సాత్త్వికభావం
బులు రాజసతామసములు పొలుపారఁగ నా
వలన జనియించె నందే
నలయగ వసియింప నుండు నవి నాయందున్. 186

గీ. అట్లు త్రిగుణవికారంబులైనయీప
దార్థములచేత మోహితం బగుచు జగము
వీనికంటెఁ బరుండనై వెలయు నన్ను
నాశరహితుని నెఱుఁగదు నరవరేణ్య. 187

గీ. త్రిగుణమయమైన యీ నాదు దివ్యమాయ
దాఁట నెవ్వరికిని సమర్థతయు లేదు
నన్నె శరణంబు నొందిన నరులు వేగ
దానిఁ దరియింపఁ గలరు సత్యంబు పార్థ. 188

క. మానక యజ్ఞానహృత
జ్ఞాను లసురభావయుతులు కల్మషకారుల్
మానులు నరాధములు నను
జానుగ శరణంబు నొందఁజాలరు విజయా. 189

వ. మఱియు దుఃఖార్తుం డగువాఁడును నన్నెఱుంగ నిశ్చ
యించినవాఁడును నర్థంబు గోరువాఁడును జ్ఞానంబుగల
వాఁడును నీచతుర్విధపురుషులు నన్ను భజింపుదు రీనలువురి
లోనఁ గేవలభక్తియుక్తుండును నిరంతరయోగనిష్ఠాగరి
ష్ఠుండు నగుజ్ఞాని యధికుండై యుండు నతని కేను మిక్కిలి
ప్రియుండ నగుదు నా కతండును బ్రియుండై యుండు. 190

గీ. అవని నీనల్వు రుత్కృష్టు లగుదురైన
జ్ఞానియగువాఁడు యోగసంకలితచిత్తుఁ
డగుచు నుత్కృష్టగతి నన్ను నధిగమించుఁ
గాన నాతండె నేనెగాఁగం దలంతు 191

గీ. అనఘ పెక్కుజన్మంబులయంతమందు
వసుధ నెవ్వాఁడు సుజ్ఞానవంతుఁడగుచు
నఖిలమును వాసుదేవుండె యనుచు నన్నుఁ
బొందు నమ్మహాత్ముఁడు దుర్లభుండు పార్థ. 192

అన్యదేవతారాధన ఫలము

వ. అర్జునా లోకంబునందుఁ గొందఱు నిజప్రకృతిచేత నియ
మితు లగుచు నయ్యైకామంబులచేత నపహృతజ్ఞానులై
మనంబున నయ్యైనియమంబుల నవలంబించి యన్యదేవతల
భజింపుదురు. మఱియు భక్తులగువా రెవ్వరెవ్వ రేయే
మూర్తుల శ్రద్ధచేతఁ బూజింప నిశ్చయించి రయ్యైజనంబుల
కే నచంచలంబైనతదాసక్తినే యొసంగుదు నతండు నా
యొసంగినభక్తిచేత నద్దేవత నారాధించి యనంతరంబ నాచేత
విహితంబులైన యభీష్టకామంబులం బ్రాపించు నన్యదేవ

తలం బూజించువా రన్యదేవతలం బొందుదు రల్పబుద్ధు
లగువారల కాఫలంబు నాశంబుగలదిరై యుండు మద్భక్తు
లగువారు నన్నే పొందుదు రదియునుంగాక. 193

సీ. అవ్యయంబు పవిత్రమత్యుత్తమంబును
బర మగుమత్స్వరూపం బెఱుఁగని
యల్పమనీషు లవ్యక్తుండ నగునన్ను
వ్యక్తరూపము గలవానిఁగాఁగఁ
దలఁపుదు రేనుసకలభూతములకుఁ బ్ర
కాశుండఁగాను నిక్కముగ మూఢ
జనము మాయాపరిచ్ఛన్నమై నను జన్మ
నిధనముల్ లేనివానిఁగ నెఱుఁగదు
చన్నభూతంబులను మని యున్నభూత
ములను మీఁద నయ్యెడి భూతముల నెఱుఁగుదు
నేను నన్నొక్కరుం డైన నెఱుఁగఁ డెపుడు
కౌరవోత్తమ యింత నిక్కంబు సువ్వె. 194

క. వినురాగద్వేషంబుగ
మునుకొని జనియించు ద్వంద్వమోహముచే ని
జ్జన మంతయు లోకమునం
దనవరతము మోహయుక్తమై యుండుగదా. 195

గీ. అనఘ పుణ్యకర్ము లైన యేమనుజుల
యఘము నాశ మొందు నట్టిపుణ్య
పురుషు లర్వి ద్వంద్వమోహనిర్ముక్తులై
నను భజింతు రెపుడు వినయశీల. 196

క. మరణము జర చనుటకు న
న్నరబుద్ధి భజింప యత్న మొనరించెడు వా
రెఱుఁగుదు రా బ్రహ్మంబును
గర మధ్యాత్మంబు సర్వకర్మంబు నొగిన్. 197

గీ. అర్జునా విను మెవ్వార లవని నన్ను
సాధిభూతాధిదైవాధియజ్ఞునిఁగ నె
ఱుంగుదురు వారు యుక్తాంతరంగు లగుచుఁ
దెలియుదురు నన్ను నమ్మేను దొలఁగు నపుడు. 198

## అక్షరపరబ్రహ్మయోగము, అష్టమాధ్యాయము

వ. అనియిట్లు సప్తమాధ్యాయంబునందుఁ బరమహంసవిజ్ఞాన యోగం బుపదేశించిన విని పురందరనందనుండు గోవిందునిం జూచి మహాత్మా బ్రహ్మంబన నెద్ది యధ్యాత్మం బధిభూతం బధిదైవం బధియజ్ఞం బన నని యెయ్యవి కర్మం బన నెద్ది ప్రయాణకాలంబునందు నియమితచిత్తు లగువారిచేత నెత్తె ఱంగునఁ దెలియంబడుదు వని యడిగిన భగవంతుం డతని కిట్లనియె. 199

సీ. బ్రహ్మ మక్షరమును బరమంబు నధ్యాత్మ
మరయంగ నది ప్రత్యగాత్మభావ
మఖిలభూతస్వరూపావిర్భవకరంబు
మఱి విసర్గంబు కర్మమున నెగడుఁ
దవిలి నశించువస్తువ యధిభూతంబు
తగఁబూరుషుం డధిదైవత మగు
నరయ నీదేహమం దధియజ్ఞుఁడను నేను
వాలాయముగ నంతకాలమందు

మనము నిట్టట్టుఁ జన నీక మరపినన్నె
సంస్మరింపుచు దేహవిసర్జనంబు
సేయు నెవ్వఁ డప్పురుషుండు చెలఁగి నన్నుఁ
బొందు నిందుకు సందియ మందవలదు. 200

క. ఏయేభావముఁ దలఁపుచుఁ
బాయక యంతమున మేను బాయు మనుష్యుం
డాయాభావము నొందును
ద్రోయక తద్భావభావితుండయి విజయా. 201

ఉ. కావున ఫల్గునా సకలకాలములందును నన్నె భక్తితోఁ
వావిరి సంస్మరింపుము ధ్రువంబుగ యుద్ధము సేయుమిత్తఱిన్
గేవలభక్తి నాపయిన కిల్బిషబుద్ధి మనంబు నేర్చి సం
భావనసేయుచున్ ననుఁ గ్రమంబుగ నొందెదు నిర్విశంకతన్.

గీ. ధరణి నభ్యాసయోగయుక్తం బనన్య
గామి యగుమానసముచేత నేమ మలరఁ
బరమపురుషుని దివ్యప్రభావయుతునిఁ
జింతసేయుచుఁ గైవల్యసిద్ధిఁ గాంచు. 203

సీ. సర్వకోవిదు నను శాసనశీలు మ
హాత్ము సనాతను నణువుకంటె
నతి సూక్ష్ముని నచింత్యు నఖిలప్రదాయకు
నాదిత్యరూపుఁ డైనట్టివానిఁ
బ్రకృతికంటెను జాలఁ బరునిఁగా నెవ్వాఁడు
చతురుఁడై మనములో సంస్మరించు
నట్టిపురుషుఁడు ప్రయాణకాలంబున
భక్తిచే నల యోగబలముచేత

నచలచిత్తంబుచే యుక్తుఁ డగుచుఁ బ్రాణ
మంచితంబుగ భ్రూమధ్యమందు నిల్పి
పరముఁ డైనట్టి యాదివ్యపురుషుఁ బొందుఁ
బాండుపుత్త్ర వేదంబు లిప్పగిది నొడువు. 204

మ. విను మెద్దాని వినాశహీనమనుగా వేదజ్ఞులుం బల్కి రిం
పున నెద్దాని యతుల్ విరాగు లగుచుం బుద్ధిం బ్రవేశింతు
రొ, యెయ్యనఁ గావింతురు బ్రహ్మచర్యమును నిత్యం బెద్ది గాం
క్షించి యర్జున యాలింపుము నీకు నట్టిపదముం సూక్ష్మం
బుగాఁ జెప్పెదన్. 205

ఉ. ద్వారము లన్ని మూసి యెదఁ దప్పక చిత్తముఁ జేర్చి శీర్షమం
దారయఁ బ్రాణముం జొనిపి యంచితవైఖరి ధారణా
యుతుం, డై రహి బ్రహ్మమైన ప్రణవాక్షరముం ననుఁ
గూర్చి పల్కుచుం, వారక దేహముం విడుచువాఁడటు
సద్గతిఁ జేరు భారతా. 206

మ. అనఘా యెవ్వఁడు నన్ను సంతత మనన్యాధీనచేతస్కుఁడై
యనువొందం స్థిరుఁడై సమాహితమనో వ్యాపారుఁడై
సంతతం, బనుమానింపక హృత్కుశేశయమునం దాసక్తిఁ
జింతించు నా,తనికిం వశ్యుఁడ వాని కే సులభుఁడం ధారాళ
మార్గంబుగన్. 207

చ. స్థిరమగుబుద్ధిచేఁ గడు నచింత్యు నగమ్యుని నన్నుఁ బొంది సం
సరణముఁ బాసి యార్యు లిటు సద్గతి నొందుదు రట్టివారుదు
స్తరతరదుఃఖవాసము నశాశ్వతముం గలుషైకమూలముం
జరయు వినాశముం గలుగు జన్మము గ్రమ్మఱ నొంద రర్వ
రన్. 208

క. అనఘా కాంచనగర్భ భ
వన మాదిగ సర్వవిష్టపంబులు వరుసన్
బునరావృత్తులు చూడఁగ
నను వొందినఁ గ్రమ్మఱ జననము లే దర్జున్. 208

క. విమలాత్మ వేయుయుగములు
కమలభవున కొక్కపగలుగా నంతియె కా
లము నిశగా నెఱిఁగెడు న
ర్వమలు లహోరాత్రకాలవిదు లగుదు రిలన్. 209

క. అవ్యక్తమువలననె స
ర్వవ్యక్తులుఁ బుట్టుఁ బవలు వచ్చిన యపుడా
యవ్యక్తమందె యణఁగును
భవ్యగుణా రాత్రివేళ వచ్చిన మరలన్. 210

వ. మఱియు నాభూతంబులే యస్వాధీనంబులై యిట్లు ప్రత్యహంబునుం బుట్టుచుఁ బ్రతిరాత్రియందు విలీనంబు లగుచు నుండు నీయవ్యక్తంబుకంటె నుత్కృష్టంబై యన్యంబై సనాతనంబై యతీంద్రియంబై యొద్ది యొకటి ప్రకాశించు నది సర్వభూతంబులు నశించినను నశింపక శాశ్వతంబై యుండుఁ దత్త్వవిదులగువా రాయక్షరంబునే పరమగతి యని చెప్పుదు రదియే మదీయంబైన పరమస్థానంబు దాని నధిగమించినమహాత్ము లెన్నటికి మరల నివర్తింపంబడరు మఱియు నెవ్వనియందు నీభూతంబు లన్నియు నివసించి యుండు నెవ్వనిచేత నీసర్వంబు వ్యాప్తంబగు నట్టిపరమపురుషుం డనన్యగతంబైన బుద్ధిచేత లభింపం దగినవాఁ డది యునుంగాక యేకాలంబునందుఁ జనినయోగులు మరల

జన్మంబునొందరే కాలంబునందుఁ జనినయోగులు గ్రమ్మఱం
జనుదెంతు రట్టికాలంబు నెఱింగించెద.

### అర్చిరాదిమార్గప్రస్తావము

అగ్నియు సూర్యుండును దినంబును శుక్లపక్షంబు నివి యభిమానదేవతలుగాఁగలయాఱు మాసంబు లుత్తరాయణంబగు నామార్గంబునంజనిన బ్రహ్మవేత్తలు బ్రహ్మంబు బ్రాపింతురు. ధూమంబును జంద్రుండును రాత్రియుఁ గృష్ణపక్షంబు నివి యభిమానదేవతలుగాఁగల యాఱుమాసంబులు దక్షిణాయనం బనంబడు నమ్మార్గంబునం జనిన యోగికిఁ బునరావృత్తిగలుగు. జగంబునందు శాశ్వతంబైన యీ శుక్లకృష్ణమార్గంబులందు నొక్కదానిచేత నపునరావృత్తియు నొక్కదానిచేతఁ బునరావృత్తియుఁ గలిగి యుండు. 211

క. ఈమార్గద్వయమును దగ
నీమహి నేయోగివర్యుఁ డెఱుఁగు నతఁ డొగిన్
వ్యామోహిగాఁడు గావున
నేమంబున నీవు యోగనిష్ఠుఁడ వగుమా. 212

చ. తపముల వేదయజ్ఞముల దానములం దిల నేఫలం బొగిన్
విపులముగాఁగఁ జెప్పఁబడె నేమరు నట్టిఫలంబు సర్వమున్
నిపుణత నాత్మలో నెఱిఁగి నిర్మలబుద్ధి నతిక్రమించి ని
శ్చపలత యోగి యాద్యమగు సద్గతి నొందు నిజంబు ఫల్గునా.

వ. అని యివ్విధంబున నెనిమిదవయధ్యాయంబునం దక్షరపరబ్రహ్మయోగం బుపదేశించి భగవంతుండు వెండియు నిట్లనియె.

## నవమాధ్యాయము, రాజవిద్యారాజగుహ్యయోగము

గీ. అరయ నెద్దాని నెఱిఁగి నీ వశుభగతిని
గడచి వర్తింతు వట్టి విజ్ఞానసహిత
మైనజ్ఞానంబు నెఱిఁగింతు నది పరంబు
పరమగుహ్యంబునై యుండుఁ బాండవేయ. 215

సీ. ఇది రాజవిద్యయు నిది రాజగుహ్యంబు
నుత్తమం బతిపుణ్య మున్నతంబు
ధర్మ్య మవ్యయము ప్రత్యక్షావగమమును
నొరిదిఁ జేయుట కతిసుఖతరంబు
మానుగ నీధర్మమార్గమం దశ్రద్ధ
ధానులై పురుషులు తవిలి నన్నుఁ
బొంద శక్తులు గాకయుంపరు మృత్యుసం
సారరూపదురంతజలధి మునిఁగి
తే. పరఁగ నీజగమెల్ల నవ్యక్తమూర్తి
నైన నాచేత నావృతం బయ్యె నిఖిల
జీవకోటినాయందు వసించి యుండు
దానియం దేను దగులము లేనివాఁడ. 216

గీ. అనఘ యున్నవి గావు నాయందుఁ బ్రాణు
లైశ్వరం బైనమద్యోగ మరసి చూడు
మస్మదీయరూపంబు భూతాళియందుఁ
దగులక భరించుఁ బెంచు భూతములనెల్ల. 217

క. ఏరీతి సర్వగతమగు
మారుత మభ్రమున నుండు మానక యెపుడా

తీరున భూతము లన్నియు
వారక నాయందె యుండుఁ బాండుకుమారా. 218

చ. ప్రళయమునందు భూతనికరంబులు మత్ప్రకృతింగమించు నే
ర్పలవడ వెండి సృష్టిసమయంబున నన్నిటి వెల్వరింతు న
గ్గలముగ నిట్లునేను బ్రతికల్పమునందుఁ బ్రకృత్యధీనమై
చెలఁగెడు భూతసంతతి సృజింతు నిజప్రకృతిస్థితుండనై.

క. వాసిగ నీపనులందు స
దాసక్తుఁడఁగాక తగ నుదాసీనునియ
ట్లాసీనుఁడ నగున న్నవి
లేసుగబద్ధునిఁగఁ జేయలేవు కిరీటీ. 220

భగవంతు నుపాసించువారల భేదములు

వ. మఱియు నాశ్రయుండనైన నాచేత నీప్రకృతి సచరాచరంబైన లోకంబంతయు సృజింపుచున్న దీహేతువువలన జగంబు విశేషంబుగాఁ బ్రవర్తిల్లుచున్నది. భూతంబులకు నియామకంబైన మదీయపరమస్వరూపం బెఱుంగక మూఢజనంబులు నిరర్థతృష్ణులును నిరర్థకర్ములును నిరర్థకజ్ఞానులును విమనస్కులునై వ్యామోహకారి యైనరాక్షసాసురసంబంధిని యగుప్రకృతి నాశ్రయించి నన్ను మనుష్యదేహంబు గలవానిఁగాఁ దలంపుదురు. కొందఱు దేవసంబంధిని యగు ప్రకృతి నాశ్రయించి మదాసక్తచిత్తులై నన్ను నాశరహితునిఁగా సమస్తభూతంబుల కాద్యునిఁగా నెఱింగి ప్రయత్నవంతులై దృఢవ్రతులై యజస్రంబు మత్ప్రభావంబుఁ గీర్తింపుచు నమస్కరింపుచు నిత్యయుక్తులై యుపాసింపుచుందురు. మఱికొందఱు జ్ఞానయజ్ఞంబుచేతఁ బూజింపుచు

నేకభావంబునఁ బృథగ్భావంబున బహుప్రకారంబుల
సర్వతోముఖుండనైన నన్నుపాసన గావింపుదు రదియునుం
గాక. 221

సీ. శ్రౌతకర్మం బేను స్మార్తకర్మం బేను
నెరి స్వధాకారంబు నేను మంత్ర
మేనాజ్య మేనగ్ని యే నౌషధం బేను
హోమకర్మం బేను సామ మేను
ఋగ్వేదమల యజుర్వేదంబు నేను లో
కమునకు నేనె నిక్కముగఁ దల్లి
తండ్రిని దాతను దాతను వేద్యంబు
నేను బవిత్రంబు నేను బ్రణవ
తే. మేను గతియు సాక్షి నేను విభుండను
బోషకుఁడ నివాసభూతుఁడను సు
రక్షణంబు సఖుఁడఁ బ్రభవప్రళయనిధా
నములు బీజమేను విమలచరిత. 222

క. వదలక యమృతము మృత్యువు
సదసత్తును నేను బొల్పెసఁగఁ దపియింతున్
బదిలముగ వృష్టి గురియుదు
ముద మలరఁగ మరలఁ గొందుఁ బుణ్యచరిత్రా. 223

చ. సురుచిరసోమపానపరిశుద్ధమహాఘులు వేదవేత్తలై
వ్వారుగల రట్టివారలు ధ్రువంబుగ స్వర్గతి గోరి నిత్యమున్
గురుతరయజ్ఞకర్మములఁ గోరికతో ననుఁబూజచేసి య
త్యురుతరదేవభోగముల నొందుదు రింద్రపురాధివాసులై.

చ. అనువుగ నట్లు స్వర్గమున నంచితభోగములన్ భుజించి చే
సినతనపుణ్య మంతయు నశించినఁ గ్రమ్మఱ మర్త్యలోకమం
దనఘ జనింతు రిట్లు హృదయంబున, గామము గోరు వేదధ
ర్మనిరతులైనవారి కిల రాకడ పోకడ గల్గు నర్జునా. 225

గీ. అనఘ యెవ్వ రనన్యులై యాత్మయందు
నను దలంపుచుఁ దగ నుపాసన యొనర్తు
రట్టి నిత్యాభియుక్తులైనట్టివారి
కేనొనర్తు యోగక్షేమ మింద్రతనయ. 226

గీ. పరఁగ నిలనన్యదేవతాభక్తు లగుచు
శ్రద్ధతోఁగూడి యెవ్వారు సంతతంబు
పూజసేతు రప్పురుషులు పోసఁగ నన్నె
పూజగావింపుదు రవిధిపూర్వకముగ. 227

గీ. పోసఁగ సర్వయజ్ఞములకు భోక్త ననియు
నధిపిభుఁడనంచు నన్ను యథార్థబుద్ధి
నెఱుఁగ రర్విలో నెవ్వ రప్పురుషు లరయ
సత్పదభ్రష్టు లగుదురు సత్యమింత. 228

గీ. సురల భజియించు పురుషుండు సురలఁ బొందుఁ
బొందుఁ బితరుల మఱి పితృపూజకుండు
భూతములఁ గొల్చువాఁ డొందు భూతములను
నన్ను భజియించు పురుషుండు నన్నుఁ బొందు. 229

పత్రపుష్పాదులు భగవత్ప్రీతికరము లనుట

చ. అలయక భక్తిచేత నియతాత్మకుఁడై గొనితెచ్చి పత్రముల్
ఫలమును బుష్పమున్ జలముఁ బాయక యెవ్వఁడు నా

కొసంగుఁ దత్ఫలమును బుష్పముగ జలము పత్త్రముఁ బ్రీతి
భుజించి యేను సొంపలరఁగ వాని కిత్తు సుగుణాకర శాశ్వత
మైన సౌఖ్యమున్. 230

భక్తుఁడు చేయుపనులన్నియు భగవంతుని కర్పింపవలెననుట

గీ. నీవుసేయుదాని నీవు భుజించెడు
దాని నీవు వేల్చుదాని నీ వొ
సంగుదాని నీవు సలిపెడుతపమును
నాకు నర్పణం బొనర్పు మనఘ. 231

స్త్రీశూద్రపాపజాతులు దేవునిభజించిరేని వారును మోక్షంబు నందుదు రనుట.

సీ. బాగుగ సన్న్యాసయోగయుక్తుండ వై
పరఁగ శుభాశుభఫలములైన
కర్మబంధంబులఁ గడువిముక్తుండ వై
నన్నుఁ బొందెద వీవు నయచరిత్ర
సర్వభూతములందు సముఁడను నాకుఁ బ్రి
యుండును మఱియు ద్వేష్యుండు లేఁడు
ఘనభక్తి నెవ్వారు నను భజింతురు వారి
యందు నే నుందు నాయందు వార
తే. లుందు రెవ్వాఁడ నన్యుఁడై యుర్వియందుఁ
గడుదురాచారియైనను గరముప్రీతి
నను భజించు నాతఁడు సాధు వనఁగఁ బరఁగుఁ
జెలఁగి మిక్కిలి యత్నంబు సేయుకతన. 232

క. ఇలలోనఁ బాపయోనులు
గలవైశ్యులు శూద్రజనుల కామినులైనన్

దలకొని నన్ను భజించినఁ
గలుగుఁ వారలకుఁ బరమగతి పాండుసుతా. 233

చ. వలనుగఁ బాపయోనులును వైశ్యులు శూద్రులు కాంతలైన
నన్నలఘుమనీషఁ గొల్చి పరమైనపదంబును గాంతురన్నచో
లలి ధరణీసురోత్తములు రాజులుఁ బొందుట కేమిచోద్యమీ
వలయక నీజగం బసుఖ మస్థిర మంచు మదిఁ దలంచి ని
శ్చలమతివై భజింపు నను శాశ్వతసౌఖ్యము నీకుఁ గల్గెడిన్.

వ. మఱియు నీవు మదాసక్తచిత్తుండవును మద్భక్తుండవును
నన్నుఁ బూజించెడివాఁడవు నాకు నమస్కరించెడివాఁడవు
గమ్మట్లు గావించితివేని మనంబున నన్నె యధిగమించెద వని
యిట్లు నవమాధ్యాయంబునందు రాజవిద్యా రాజగుహ్య
యోగం బుపదేశించి భగవంతుండు వెండియు నిట్లనియె.

## దశమాధ్యాయము, విభూతియోగము

క. పరమానందుఁడ వగునీ
కురువడి హితమాచరింప నుద్యుక్తుఁడనై
పరమం బగువాక్యంబే
నెఱిఁగించెద వినుము పార్థ యింపుదలిర్పన్. 236

చ. అమరగణంబులుఁ మఱి మహర్షివరేణ్యులు మత్ప్రభావ
ముఁ, సమముగ సర్వముఁ దెలియజాలరు నే నటు సంత
తంబు న, య్యమరులకుఁ మహర్షులకు నాద్యుఁడఁజూచిన
నెల్లభంగులఁ, విమలగుణా నిజం బిది వివేకము గల్గినవారి
కెంతయున్. 237

గీ. అజునిఁగ ననాదిఁగా సమస్తజగములకు
నీశ్వరునిఁగాఁగ బుద్ధి నన్నెవ్వఁడెఱుఁగు
నతఁడు జనములలోన మోహవిరహితుఁడు
సర్వపాపప్రముక్తుఁడై జగతి వెలయు. 238

చ. శమముఁ జ్ఞానము బుద్ధియుఁ సుఖదయాసత్యంబు సమ్మో
హముఁ,దమదుఃఖాభయసాధ్వసంబులు తపోదానాయశో
కీర్తిజ, క్షములుఁ భావము తుష్ట్యహింసలును సామ్యం
బాదిగా భావబృందము నాచేతఁబృథగ్విధంబుగ నగుఁ
దత్త్వజ్ఞ భూతాళికిన్. 239

గీ. శక్రతనయ మరీచ్యాదిసప్తఋషులు
తవిలిస్వాయంభువాదిమనువులు నలువు
రనఘ మానసపుత్త్రకులై జనించి
ప్రజలఁ బుట్టించి రవని మద్భావులగుచు. 240

చ. పనివడి యెవ్వఁడే నిపుడు పల్కిన యీసువిభూతియోగ
ముఁ,ఘనత నెఱుంగు నాతఁ డవికంపితయోగము నొందు
నిత్యముఁ, గొనకొని యేను సర్వమునకుఁ బ్రభవంబు
జగంబు నాయెడఁ, దనరునటంచు భావయుతతత్త్వవిదుల్
ననుఁ గొల్తు రెప్పుడున్. 240

భగవద్భక్తిసేయువారి యజ్ఞానంబు భగవంతుఁడే పోఁగొట్టుననుట

చ. మఱవక మద్గతాసులయి మద్గతమానసులై భువిఁ బర
స్పరమును జెప్పుకొంచు ననుఁ జక్కఁగ బోధము చేసికొంచు బం
ధురముగ నాత్మలోనఁ బరితుష్టి వహింపుచు సంతసింపుచుఁ
వరుస రమించుచుందురు ధ్రువంబుగ వారనిశంబు ఫల్గునా.

గీ. భక్తిపూర్వకముగనన్ను భజనసేయు
నట్టి నిత్యయోగులకు నే నంచితముగ
నరయ నెద్దానిచేత న న్నధిగమింతు
రట్టిబుద్ధియోగము నిత్తు ననఘచరిత. 243

క. మఱియుఁ వారలఁ దగ నా
దరించుటకుఁ దన్మనోబ్జధామస్థుఁడనై
కఱుతుగ నజ్ఞానజను
స్థిరతమము హరింతు జ్ఞానదీపము చేతన్. 244

వ. అనిన నర్జునుం డిట్లనియె దేవా నీవు పరమాత్మ యనియుఁ బరమ తేజం బనియుఁ బరమోత్కృష్టుండ వనియుఁ బరమ పవిత్రుండ వనియు నాదిదేవుండవనియు నుత్పత్తిరహితుండ వనియు నియామకుండ వనియు దేవర్షి యగు నారదుండును నసితుండును దేవలుండును గృష్ణద్వైపాయనుండును దక్కినమహర్షులందఱును వక్కాణించి రయ్యర్థంబె మీరును వాత్సల్యంబున నుపదేశించితిరి. మీ రుపదేశించినయర్థం బింతయు సత్యంబుగాఁ దలంచెద. మహానుభావుండ వైన నీప్రభావంబు దేవదానవులయిన నెఱుంగరు. భూతభావ నుండవు సర్వభూతేశ్వరుండవు సర్వజగన్నాథుండవు దేవ దేవుండవైననీవే నీచేత నీయంత ని న్నెఱుంగుదువు 245

సీ. ఏవిభూతులచేత నీలోకములనన్ని
వ్యాపించి యుండుదు వట్టినీదు
దివ్యభూతులు దెలియంగ నన్నియు
వివరించి చెప్పుము విస్తరముగఁ

తెలఁగి నిన్నెప్పుడు చింతసేయుచు నెట్లు
యోగమున్ దెలియుదు నుర్విలోన
మొనసియేయేభావములయందు నాచేతఁ
జింతింపఁ దగుదువు సంతతంబు
తే. పుణ్యచారిత్ర నీదు విభూతి యెల్ల
వేడ్క నెఱిఁగింపు మరల సవిస్తరముగ
నమృతమయమైన దీని నత్యాదరమున
నెంత విన్నను నాకు సంతృప్తిలేదు. 246

వ. అని యడిగిన సవ్యసాచిం జూచి మదీయంబులైన దివ్య విభూతు లనంతంబులై యుండు వాని విస్తరంబులకు నంతంబు లేదు ప్రాధాన్యంబునన్ గొన్ని యెఱింగించెద వినుమని వాసుదేవుండిట్లనియె. 247

విభూతివిస్తృతి

గీ. సకలభూతమానసములందు సంతతం
బాత్మరూపకలన నధివసింతు
నేనె భూతములకు నెంతయు మొదలును
నడుము తుదియు నగుదు నయచరిత్ర. 248

సీ. అనఘ యాదిత్యులయందు విష్ణుఁడ నేను
జ్యోతిస్సులందు సూర్యుండ నేను
దలఁప మారుతములం దలమరీచియు నేను
సకలతారలలోన శశియు నేను
సామవేదము నేను సర్వవేదములందు
దివిజులలోన వాసవుఁడ నేను

బూని యింద్రియములలోన మానస మేను
భూతంబులం దేను జేతనంబు
తే. పరఁగ రుద్రులయందు శంకరుఁడ నేను
యక్షరాక్షసకోటిలో యక్షుఁడేను
వసుగణంబులలోనఁ బావకుఁడ నేను
మేదినీధరములలోన మేరు వేను. 249

క. మఱియుఁ బురోహితులందే
నసుదుగ గురుఁడను జమూగణాధి పులం దే
నరయంగఁ గార్తికేయుఁడ
సరసులలోపలను నేను సాగర మగుదున్. 250

గీ. విను మహర్షులలో నేను భృగువు నగుదుఁ
బరఁగ వాక్కుల లోపలఁ బ్రణవ మేను
యజ్ఞములలోనఁ గడు జపయజ్ఞ మేను
స్థావరంబులలో హిమశైల మేను. 251

గీ. వృక్షములలోన నశ్వత్థవృక్ష మేను
త్రిదశమునులందు వినుము నారదుఁడ నేను
చెలఁగి గంధర్వులం దేను జిత్రరథుఁడ
సిద్ధులం దేను గపిలుండ విద్ధచరిత. 252

గీ. వనధి నమృతంబుతోఁ గూడ జనన మొంది
నట్టి యుచ్చైశ్శ్రవం బేను హయములందు
గజములందు నైరావతగజము నేను
పరఁగ నరపతి నగుదును నరులలోన. 253

గీ. ఆయుధంబులలో వజ్ర మయితి నేను
ధేనువులలోన నల కామధేను వేను

ప్రజననంబున కేను దర్పకుఁడ నైతి
నహివితతియందు వాసుకి నైతి నేను. 254

గీ. క్షోణిధరములలోన శేషుండ నేను
వనచరంబులలోపల వరుణుఁ డేను
రమణఁబితరులలోన నర్యముఁడ నేను
కాలుఁడను నేను దండాధికారులందు. 255

గీ. వినుము ప్రహ్లాదుఁ డన్నేను దనుజులందు
గణుతి యొనరింపు వారిలోఁ గాల మేను
అఖిల మృగములలోన సింహంబు నేను
వైనతేయుఁడ నగుదును బక్షులందు. 256

గీ. పావనము సేయు వారిలోఁ బవన మేను
శస్త్రధారులలో రామచంద్రుఁ డేను
మత్స్యములలోనఁ దలపోయ మకర మేను
నదులలోపల జాహ్నవీనదియు నేను. 257

గీ. పాండునందన విను మీ ప్రపంచమునకు
నరయ నాదియు మధ్యంబు నంత మేను
విద్యలందు మఱియు నాత్మవిద్య నేను
వాదవంతులలోపల వాద మేను. 258

సీ. అనఘ యక్షరములయం దకారము నేను
దగ సమాసములందు ద్వంద్వ మేను
మానుగ నాశంబు లేనికాలం బేను
విశ్వతోముఖుఁ డైన విధియు నేను
గడఁగి సర్వము మ్రింగు కాలమృత్యువు నేను
కానున్న పని కేను గారణంబు

సతులలోఁ గీర్తియును శ్రీయు సత్యమును లక్ష్మియు
స్మృతియును మేధయు ధృతియు నేను
తే. సామములయందు మఱి బృహత్సామ మేను
దలఁప గాయత్రి నేను ఛందములలోన
నరవి నెలలందు మార్గశీర్షంబు నేను
ఋతువులం దర్జున వసంత ఋతువు నేను 259
గీ. మోస మొనరించువారిలో మొనసి జూద
మేను తేజోభిసన్నులం దేను తేజ
మనఘ వ్యవసాయ మేను జయంబు నేను
సాత్త్వికులలోపలను జూడ సత్త్వమేను. 260
గీ. వరుస యదువులందు వాసుదేవుఁడ నేను
పాండుతనయులందు ఫల్గునుండ
నేను మౌనులందు నేను వ్యాసుండను
గవులలోన విజయ కావ్యుఁడేను. 261
గీ. ధరణి దండించు వారల దండ మేను
ఖ్యాతి గనిన జిగీషుల నీతి నేను
మానక రహస్యములలోన మౌన మేను
దెలివి గలవారి యందున్న తెలివి నేను. 262
గీ. పృథివి సకలభూతములకు బీజ మేను
జంగమస్థావరాత్మక సకలభూత
నివహసంసృష్టి కెంతయు నేనె మిగులఁ
గర్త నగుదు వేఱొకఁడు నాకంటె లేఁడు. 263
వ. ధనంజయా దివ్యంబులైన మద్విభూతుల కంతంబు లేదు
విభూతివిస్తారంబు నాచేత సంక్షేపంబుగా నెఱింగింపం

బడియె లోకంబునందు నేయేవస్తువు విభూతిమంతంబై శ్రీ
మంతంబై ప్రకాశించు నయ్యె వస్తువు నెల్ల మదీయదివ్య
తేజోంశసంభవంబునుగాఁ దెలియము విశేషించి చెప్ప నేల
యీజగం బంతయు నొక్కయంశంబుచేత నావరించుచున్న
వాఁడ నని యిట్లు దశమాధ్యాయంబునందు విభూతివిస్తార
యోగం బుపదేశించిన విని యర్జునుం డిట్లనియె. 264

## ఏకాదశాధ్యాయము, విశ్వరూపసందర్శనయోగము

క. అరుదుగ నాపయిఁ గృపచే
గూఱుతుగ నీపరమదివ్య గుహ్యాధ్యాత్మం
బెఱిఁగించితి వటు గావున
నరవిందదళాక్ష మోహ మంతయుఁ దోలఁగెన్. 265

చ. నలువుగ సర్వభూత జననంబును దత్ప్రళయంబు తావకా
త్యలఘుతరప్రభావము దయామతివై యెఱిఁగించి తీవు మం
గళకరమూర్తి యింతకును గారణమైన భవత్స్వరూపముఁ
గలయఁగఁ జూడఁ గోరెదను గ్రక్కునఁ జూపఁ గదయ్య
కేశవా. 266

క. ఘనముగఁ దద్రూపము నో
యన్నఁ జూడఁగ నాకు శక్యమగు నేని వినా
శనరహిత మద్భుతంబై
తనరెడి నీమొదలితనువు తగఁజూపు మిఁకన్. 267

వ. అనిన భగవంతుం డిట్లనియె. 268

అర్జునునికి దివ్యదృష్టి నిచ్చుట

సీ. అమరేంద్రతనయ నానాకారములును నా
నా వర్ణములును నానావిధములు

దివ్యంబులైన మద్దేహంబు లన్నియుఁ
గడుఁ జోద్యముగ నీవు గాంచు మిపుడు
వసువులు రుద్రులు వరుస నాదిత్యులు
గరుడగంధర్వకిన్నరులు మునులు
సచరాచరంబైన జగము మున్నెన్నఁడుఁ
జూడని యవి యెల్ల సొంపు మీఱఁ

తే. దెలియు మద్దేహమం దేక దేశమందుఁ
జూచె దీనేత్రములచేతఁ జూడ నలవి
గాదు గావున నీకు సత్కరుణ దివ్య
చక్షువు లొసంగెదను గొమ్ము సంతసమున. 269



క. అని పలికి వాసుదేవుఁడు
ఘనపరమం బైశ్వరంబు కడుఁజిత్రం బౌ
తనరూపముఁ జూపించెను
బనివడి యర్జునుని కపుడు పార్థివముఖ్యా. 270

వ. ఇట్లనేకవదనంబులు ననేకశీర్షంబులు గలదాని ననేకాద్భుత దర్శనంబగుదాని దివ్యాభరణభూషితంబగుదాని దివ్యానే కాయుధపరిష్కృతంబగుదాని దివ్యగంధాధివాసితంబగు దాని దివ్యమాల్యాంబరశోభితంబగుదాని సర్వాశ్చర్య మయంబగుదాని సర్వతోముఖంబగుదాని ననంతంబగుదాని దివ్యంబైనదాని గగనంబునం దనేకసహస్రసూర్యు లేక కాలంబున నొక్కచోటం గూడినప్పు డెట్టితేజం బావిర్భ

వించు నట్టితేజంబునకు సాటిసేయం దగినదానిఁ దన మహ
నీయరూపంబుఁ జూపించినం జూచి యందొక్కదేశంబునందు
బహుప్రకారంబులం బ్రవిభక్తంబై విలసిల్లు సచరాచరం
బైన జగం బంతయు విలోకించి యాశ్చర్యరసావిష్టచిత్తుం
డును హర్షపులకితగాత్రుండునై యర్జునుం డమ్మహాత్మునకు
దండప్రణామం బాచరించి యంజలిఁ గీలించి యిట్లనియె. 271

ఉ. ఆతతమైననీతనువునందఖిలామరదైత్యబృందముల్
భూతవిశేషసంఘములఁ బొల్పలరన్ గమలాసనస్థుఁడౌ
ధాతను బార్వతీవిభునిఁ దక్కినవాసవముఖ్యదిక్పతి
వ్రాతము దివ్యమౌనులను బన్నగులం గనుఁగొంటిఁ గేశవా.

చ. ఎలమి ననేకబాహువు లనేకముఖంబు లనేకనేత్రముల్
గలిగి యనంతమై బహుముఖంబుల నొప్పెడు నిన్నుఁ గంటి సొం,
పలరఁగ నీదురూపమున కాదియు మధ్యము నంతమున్ రహిన్,
బొలుపుగఁ గాంచలేనయితి భూతమహేశ్వర యేమి
సెప్పుదున్. 273

ఉ. చారుకిరీటమున్ గదయు శంఖము చక్రముఁ గల్గువాని సొం
పారఁగ నంతటం గలిసి యద్భుతభంగి వెలుంగువాని నె
వ్వారికి దుర్నిరీక్ష్యుఁడగువాని మహోనిధియైనవాని దీ
ప్తారుణవహ్నిదీప్తి జగదాత్ము నమేయుని నిన్నుఁ గాంచితిన్.

చ. నీవు వినాశహీనుఁడవు నిత్యుఁడవున్ బరమంబు వేద్యమున్
నీవు రహిన్ జగంబులకు నేత వనుత్తమమైన కారణం
బీవు పురాణపూరుషుఁడ వెంతయు శాశ్వతధర్మగోప్తవున్
నీవు జగన్మయుండ వని నిక్కముగాఁగఁ దలంతు మాధవా.

ఉ. సంతతముఁ స్వతేజమున సర్వజగంబు తపించువాని న
త్యంతదురంతవీర్యుని ననంతభుజాననశీర్షు నాదిమ
ధ్యాంతవిహీను భాస్కరశశాంకవిలోచనుఁ బావకాస్యునిం
బంత మెలర్ప నిన్ని పుడు బాగుగఁ గన్గొని చోద్య మందితిన్.

చ. మఱియు వసుంధరాగగనమధ్యగతం బగు దేశ మంతయుం
వెరవుగ దిక్కులన్నియును నిండి చెలంగుచు నున్న వాఁడ వీ
నిరుపమఘోరచిత్ర మగు నీదగురూపముఁ జూచిలోకముల్
కరము భయంబునం మిగుల గాసిలుచున్నవి పద్మలోచనా.

చ. గుఱుతుగ నాదితేయు లొకకొందఱు నీయెడఁ జేరుచున్న వా
రరుదుగఁ గొంద ఱొక్కమొగిఁ బ్రాంజలులై వినుతింపు
చున్న వా, రరయఁగ సిద్ధసంఘము మహర్షులు స్వస్తి
యటంచుఁ బల్కుచుం, నిరుపమపుష్కలస్తుతుల నిన్ను
నుతింపుచు నున్న వా రొగిన్. 278

విశ్వరూపంబుఁ జూచి యర్జునుండు భయంబునొందుట

సీ. వనజాక్ష రుద్రులు వసువు లాదిత్యులు
సాధ్యులు సిద్ధులు చారణులును
గరుడగంధర్వకిన్నరయక్షరాక్షస
త్రిదశులు నశ్వినీదేవతలును
విశ్వులు వాయువుల్ పితృదేవతలురిచ్చ
పడి చూచుచున్నారు పరఁగ నిన్నుఁ
బెక్కు నేత్రంబులు పెక్కుముఖంబులు
బహుభుజోరూదరపాదములును

తే. బెక్కుముఖగహ్వరంబులు పెక్కులైన
దంష్ట్రలును గల్గి రాజిల్లు తావకీన

రూపమును జూచి భయ మంది లోక మడలు
చున్న దట్లేను భయ మంది యున్న వాఁడ. 279

చ. అరుదుగ నంబరోల్లిఖితమై కడు దీప్తమునై ప్రదీప్తబం
ధురతరభూరినేత్రమయి దుస్తరమై బహువర్ణయుక్తమై
బరువడి వ్యాత్తవక్త్రమయి భాసిలు నిన్నటు చూచి భీతిచే
నెరిసెడి యున్నవాఁడ నిట నే శమమున్ ధృతిఁ గాన
కెంతయున్. 280

గీ. వితతదంష్ట్రికరాళసంయుతము లగుచు
విలయకాలాగ్నిసమములై వెలయుచున్న
నీముఖంబులు గనుఁగొని నేఁడు దిశలు
దెలియకున్నాఁడఁ గృపసేయు మలఘుచరిత. 281

విశ్వరూపధరుని నీ వెవ్వండ వనియడుగుట

వ. దేవా ధృతరాష్ట్రనందను లయిన దుర్యోధనాదు లందఱును
భీష్ముండును ద్రోణుండును గర్ణుండును మనసేనలోనం గల
సేనానాయకులును సమస్త భూపాలసంఘంబులతోఁ గూడ
దంష్ట్రికరాళయుక్తంబు లయినభవదీయభయంకరవదనంబు
లందు శీఘ్రంబునం బ్రవేశింపుచున్నవా రందుఁ గొందఱు
దశనమధ్యంబులం జిక్కి చూర్ణీకృతోత్తమాంగులై చూపట్టు
చున్నవారు గొంద ఱీమహీనాథముఖ్యులు బహుళంబు
లయిన నదీప్రవాహంబు లెట్లు సముద్రంబుఁ బ్రవేశించు
నట్లు ప్రజ్వలితంబులైన భవన్ముఖంబులం బ్రవేశింపుచున్న
వారు మఱియు శలభంబు లాత్మనాశంబుకొఱకు నతివేగం
బునం బ్రదీప్తం బగు వహ్నియం దుఱికినచందంబున లోకంబు
లన్నియు నాశంబుకొఱకు యుష్మద్వదనంబులం దతిరయం

బునం బడుచున్నయవి. ప్రదీప్తంబులైన వదనంబులచేత లోకంబుల నన్నింటిని మ్రింగుచు నాస్వాదించుచున్న వాఁడవు భవదీయంబులైన మహోగ్రదీప్తులాత్మీయ తేజంబుచేత జగంబులన్నియు నావరించి తపింపఁజేయుచున్నయవి. మహాత్మా! నీకు నమస్కారంబుఁగావించెద. మహోగ్రరూపుండవైన నీవెవ్వండవు. ప్రసన్నుండవై నాకెఱింగింపుము. భవద్వ్యాపారంబు నెద్దియు నెఱుంగ నాద్యుండవైన నిన్నెఱుంగ నిచ్ఛయించి యున్నవాఁడ నని యభ్యర్థించిన నద్దేవదేవుండు ప్రసన్నుండై యిట్లనియె. 282

సీ. కౌరవవర్య లోకక్షయం బొనరించు
ప్రళయకాలం బేను బరఁగ నిచట
సకల లోకంబుల సంహరించుట కేను
వర్తింపుచున్నాఁడ వరుసతోడ
నుభయసైన్యములయం దున్నవారందఱు
నిలువంగ లే రొక్క నీవు దక్కఁ
గావున నీవు సంగ్రామంబునకు లెమ్ము
శత్రులఁ దునిమి యశంబు వడయు
మఖిలభోగసమృద్ధరాజ్యంబు గుడువు
మరయ నింతకు మున్నె యీయఖిల యోధు
లొకట నాచేత నిహతులై యున్నవారు
దొలఁగ కీవు నిమిత్తమాత్రుండవగుము. 283

మ. మును నాచే హతులైనయీసురనదీపుత్త్రుఁ భరద్వాజపుత్త్రుని దుశ్శాసను సైంధవుఁ శకుని నాదుర్యోధనుం గర్ణుఁ దక్కిన భూపాలురనాజిఁ ద్రుంపుము మనఃఖేదంబు చాలింపు

మో, యనఘా వైరుల నెల్లఁద్రుంచెదవు జన్యం బింకఁ
గావింపుమా. 284

వ. అట్లు మధుసూదనుం డానతిచ్చెనని సంజయుండు ధృత
రాష్ట్రునకుం జెప్పి వెండియు నతని విలోకించి నరేంద్రా
యనంతరంబ యమ్మహానుభావుని వచనంబు విని యర్జునుండు
వడవడ వణంకుచు దండప్రణామం బాచరించి కృతాంజలి
పుటుండై వినయవినమిత శరీరుండై భయంబునఁ బునఃపునః
ప్రణామంబులు సేయుచు గద్గదస్వరంబున నిట్లనియె. 285

మ. అనఘాత్మా భవదీయకీర్తనముచే నానందసంయుక్తమై
ఘనరాగాన్వితమై జగత్త్రితయముం గన్పట్టె దైత్యాధ
ముల్,వనటం దద్దయు భీతిచే దిశల కెల్లం బాఱుచున్నారు
మెల్లన హర్షంబున సిద్ధసాధ్యులు నతుల్గావింపుచున్నా
రొగిన్. 286

సీ. దేవలోకాధార దేవతేశ యనంత
కడు సదసత్తులకన్న నవలఁ
దనరారుదివ్యతత్త్వం బెద్ది యది నీవ
యక్షరం బది నీవ యబ్జభవున
కాదికర్తవు నీవ యతిగరీయుఁడ వీవ
నీకు మ్రొక్కనివారు లోకమందుఁ
గలరె నీ వఖిలలోకములకుఁ గారణం
బాదిదేవుఁడవు వేద్యంబు నీవు

తే. వేత్తవు సనాతనుండవు విశ్వసాక్షి
వలపరంధాముఁడవు పరమాత్మ వఖిల

విశ్వమెల్లను నీయందు వెలుఁగుచుండుఁ
దలఁప నీరూపములకు నంతంబు లేదు. 287

అర్జునుండు శరణాగతుం డగుట

ఉ. నీవు ప్రభంజనుండవును నీవు యముండును నీవు వహ్ని
యుఁ గా, నీవు ప్రచేతసుఁడవును నీవు విభుండవు నీవు ధాత
వుఁ గా,నీవు రమాధినాథుఁడవు నీకిటు వేయునమస్కృతుల్
ననుం,గావున వేయుదండములు గ్రమ్మఱఁ గ్రమ్మఱ వేయు
దండముల్. 288

వ. దేవా నీవు సర్వవ్యాపకుండ వగుటం జేసి సర్వశబ్దవాచ్యుండ
వైతి వట్టి సర్వరూపుండవైన నీకు వెనుక ముందర నంతట
నమస్కారంబు గావించెద. నీ విట్టిమహిమ గలవాఁడ వని
యెఱుంగక సఖుండ వని తలఁచి శ్రీకృష్ణ యాదవ సఖా యని
తిరస్కరించి యజ్ఞానంబున నెయ్యది నాచేతఁ బలుకం బడియె
దానిని మఱియు విహారశయ్యాసనభోజనంబులయం దపహా
సంబుకొఱకు నాచేత సత్కరింపఁబడనివాఁడ వైతి వట్టి యప
రాధంబును బరోక్షంబు నొందిన వాఁడవైతి యది ప్రత్య
క్షంబునందును నసత్కృతుండ వైతి వట్టియపచారంబును
క్షమించుటకు నప్రమేయస్వరూపుండ వైననిన్నుం బ్రార్థిం
చెద. నీవు చరాచరాత్మకం బై నసర్వజగంబునకు జనకుండవు
పూజ్యుండవు గురుండవు శ్రేష్ఠుండవు నైతివి. ఈముల్లో
కంబులయందు నసమానప్రభావుండ వైననీకు సముం డగు
వాఁడును నీకంటె నధికుం డగువాఁడు నెవ్వండు లేఁడు
గావున వినయవినమితశరీరుండనై పరమేశ్వరుండవు స్తోత్రా
ర్హుండవైన నీకుఁ బ్రణమిల్లి కృతాంజలిపుటుండనై వేఁడెద.

నాయందుఁ బ్రసన్నుండవై పుత్త్రునియపరాధంబు తండ్రి
యుంబోలె సఖునియపరాధంబు సఖుండునుంబోలెఁ బ్రియు
రాలి యపరాధంబు ప్రియుండునుంబోలె భక్తుండనైన
నాయపరాధంబు సహింపుము. 289

సీ. అనఘాత్మ మున్ను చూడని నీదురూపంబు
గాంచి సంతోషసంగతుఁడ నైతి
నస్మన్మనంబు భయంబుచేమిక్కిలి
వ్యథితమైయున్నది పరఁగ దీని
నుజ్జగింపుము వనజోదర శంఖంబు
చక్రంబు గదయును శార్ఙ్గ మలచ
తుర్భుజంబులు మణిద్యుతికిరీటముఁ గల
భవదీయశాంతరూపంబుఁ జూడఁ
గోరుచున్నాఁడ నామీఁది కూర్మి చేత
సుప్రసన్నుండవై కడు సురుచిరముగ
వరుస నీతొంటిసౌమ్యరూపంబుఁ జూపు
మాదిదేవ యనంత సహస్రనయన. 290

విశ్వరూపంబు నుపసంహరించుట

వ. అనిన భగవంతుం డిట్లనియె. 291

చ. జనవరపుత్త్ర నీయెడఁ బ్రసన్నుఁడనై పరమైనదాని న
త్యనుపమమైనదాని సుమహస్సముదంచితమైనదాని మ
ద్ఘనతరవిశ్వరూపమును గ్రక్కునఁ జూపితి నాత్మయోగ యు
క్తినొరు లెఱుంగ రాద్యమగుదీని ఘనుండవు నీవుదక్కఁగన్.

చ. ఉరుగతి యజ్ఞదానముల నుగ్రతపోధ్యయ నాదికంబులన్
సురుచిరనిత్యసత్క్రియలఁ జూడ నశక్యుఁడనైతి నేను స

త్కారణ దలిర్ప నట్టిఘనకాయముఁ జూపితి నీకు ధాత్రిలో
నధుదుగ దీనిఁ జూడఁగఁ ద్వదన్యుఁడు శక్తుఁడు గాఁడు
ఫల్గునా. 293

చ. ఇల నతిఘోరమై పరఁగు నీదృశ మైనమదీయరూపముల్
వలనుగఁజూచి భీతి మది వల్వదు నీ కిటు మూఢభావముల్
వలవదుతొంటి సౌఖ్యమగుభావముఁ జూపెదనిర్భయుండవై
యలయక ప్రీతమానసుఁడవై గను మిప్పుడు పాండునందనా.

సౌమ్యరూపంబు చూపుట

క. అని పలికి వాసుదేవుఁడు
పనివడి యాత్మీయరూపబాహుళ్యము గ్ర
క్కున మాటుపఱచి నరునకు
మునుపటి సౌమ్యస్వరూపముల్ జూపె రహిన్. 295

వ. అని పలికి సంజయుండు వెండియు ధృతరాష్ట్రున కిట్లనియె
నట్లుగోవిందుం డర్జుననకుఁ దనయొప్పటి సౌమ్యరూపంబుఁ
జూపి భీతుండైనయతని మధురవాక్యంబుల నాశ్వాసించిన
నాఫల్గునుండు స్వస్థచిత్తుండై గ్రమ్మఱ నమ్మహానుభావున
కిట్లనియె. 296

గీ. మానుషంబైన నీదుసౌమ్యస్వరూప
మిది విలోకించి చేవ యేనిపుడు ప్రకృతి
నొంది స్వస్థమానసుఁడనై యున్నవాఁడ
ననిన నరునకు మరల నిట్లనియె శౌరి. 297

గీ. అనఘ చూడ నశక్యమైనట్టి నాదు
రూప మిపుడెద్దీ నీకు నేరుపున నిట్లు

దర్శితం బయ్యె దాని సంతతముఁ జూడఁ
గోరుదురు వేల్పు లెప్పుడు సూరివినుత. 298

గీ. సొరిది నన్నిపు డీ వెట్లుసూచి తట్లు
సూచుటకు నేను జపతపశ్శ్రుతులచేత
విమలమఖములచేత దానములచేతఁ
గర్మములచేత శక్యుండఁ గానుజుమ్మి. 299

గీ. పాండవో_త్తమ యిట్టిరూపంబుగలిగి
నట్టి యేనన్యగతముగా నట్టిభ_క్తి
చేతఁ దెలియుటకును బ్రవేశించుటకును
జూచుటకును శక్యుఁడ నౌదు శుభచరిత్ర. 300

చ. అనిశము నాకుఁ బ్రీతికరమైన సుకర్మము నాచరింపుచుఞ్
మునుకొనినన్ను శ్రేష్ఠునిగ బుద్ధిఁ దలంపుచు నాకు భక్తుఁడై
మనమున సర్వభూతగణమందు విరోధముమాని సంగముఞ్
దునిమినవాఁ డెవండు ననుసూల్కొని పొందు నతండు
పాండవా. 301

## ద్వాదశాధ్యాయము, భ_క్తియోగము

వ. అని యిట్లుపదునొకొండవయధ్యాయంబు నందు విశ్వరూప సందర్శనయోగం బుపదేశించిన విని యర్జునుండు హృషీకేశుంజూచి దేవా యివ్విధంబున లోకంబునందు భక్తులై నిరంతరయోగయుక్తులై నిన్నుపాసించువా రెవ్వారు గల రెవ్వారు నాశరహితం బైనయవ్య_క్తంబు నుపాసింతురు వారలలోన నెవ్వరు యోగంబు నెఱంగినవారిలో నుత్తము లగుదు రెఱింగింపు మని యడిగిన నప్పుండరీకాక్షుం డిట్లనియె.

క. పరమశ్రద్ధాయుతులై
స్థిరముగ నాయందు మనము చేర్చి సతతయో
గరతి ననుఁ గొల్చువారలు
నరసాత్మక నాకు యుక్తసమ్మతు లుర్విన్. 303

చ. సకలప్రాణిహితార్థులై జితమనస్సర్వేంద్రియ గ్రాములై
ప్రకటింపక సుబుద్ధులై పరమ మవ్యక్తం బనిర్దేశ్యముఁ
సకలస్థం బచలం బచింత్యము ననాశం బైనకూటస్థముఁ
సకలుండై భజియించు నాతఁడును నన్బ్రాపించునశ్రాంత
మున్. 304

వ. ఇట్లీలంగునఁ బరమభక్తులై నన్నుపాసించు వారలును నక్ష
రంబు నుపాసించువారలు నయ్యుభయులు నన్నే పొందుదు
రీయిరుతెఱంగులవారికి నాకంటె నన్యం బైనప్రాప్యస్థానం
బెద్దియు లేదైన నిందు విశేషంబు నెఱింగించెద వినుము.

గీ. పరఁగు ప్రాణులకుర్వి నవ్యక్తమార్గ
మది యధిగమించుటకుఁ గష్ట మట్లు గాన
నరయ నవ్యక్తగతచిత్తు లైనవారి
కధికతర మగుసంక్లేశ మనఘచరిత. 306

సీ. సతతంబు నాయందు సర్వకర్మంబులు
విడిచి యన్యము గాని వితతయోగ
మున నన్నుఁ దలఁపుచు మునుకొని మత్పరు
లై యెవ్వరు భజింతు రట్టియోగ
విమల మదాసక్తహృదయుల సంసార
వనధిలోపలఁబడి మునుఁగ కుండ

వెస నుద్ధరించెద విను మీవు నాయందు
మనము నేర్పుము బుద్ధి మరులుగొల్పు

తే. మవల నాయందె యుండెద వట్లు మాన
సంబు సుస్థిరముగఁ జేయఁ జాలవేని
కడఁగి యవల నభ్యాసయోగంబుచేతఁ
జెలఁగి ననుఁ బొంద యత్నంబు సేయు మనఘ. 307

గీ. తొడరి యభ్యాసమం దశక్తుండ వైతి
వేని మత్కర్మపరముఁడవై నెగడుము
కర్మములను మదర్థంబుగా నొనర్చి
సిద్ధివడసెద వీవు ప్రసిద్ధచరిత. 308

గీ. సరవిఁ గర్మంబు లొనరింపఁ జాల వేని
యనఘ మద్భక్తియోగంబు నాశ్రయించి
సంయతాత్మవంతుండవై సర్వకర్మ
ఫలపరిత్యాగి వగుమీవు కలఁక లేక. 309

వ. పాండునందనా ! యభ్యాసంబుకంటె జ్ఞానంబు శ్రేయంబు. జ్ఞానంబుకంటె ధ్యానం బధికం బగు ధ్యానంబుకన్న ఫలపరిత్యాగం బెక్కుడై యుండుఁ గర్మఫల పరిత్యాగంబుకంటె శాంతిఘనం బగు నదియునుం గాక సర్వభూతంబుల కద్వేష్యుండును మిత్రభావుండును మమతారహితుండును నిరహంకారుండును దయాళుండును సమసుఖదుఃఖుండును క్షమాసమేతుండును నిరంతరసంతుష్టుండును యోగియు నియతాత్ముండును దృఢనిశ్చయుండును మదర్పితబుద్ధి,

మానసుండునై యెవ్వండు ప్రవర్తించు నట్టి భక్తుండు
నాకుఁ బ్రియుండు. 310

గీ. ప్రజలవలనఁ దనకుఁ బ్రజలకుఁ దనదెస
భయము లేకమర్ష భయముదముల
చే విముక్తుఁ డగుచుఁ జెలఁగు నెవ్వాఁ డట్టి
సజ్జనుండు నాకు సమ్మతుండు. 311

సీ. దక్షుండు శుచి యనపేక్షుం డుదాసీనుఁ
డపగతవ్యథుఁడు మదాశ్రయుండు
సర్వకార్యారంభ సంపరిత్యక్తుండు
మోహ రాగ ద్వేష మోద శోక
వర్జితుండు శుభాశుభత్యాగి తుల్యమా
నావమానుండు తుల్యారిసఖుఁడు
తుల్యశీతోష్ణుండు తుల్యదుఃఖ సుఖుండు
తుల్యవిగర్హణస్తుతియు మౌన
తే. యుతుఁడు సంగరహితుఁ డొగి యదృచ్ఛాలాభ
తుష్టుఁ డచలబుద్ధి నిష్ఠుఁ డమలుఁ
డధికభక్తి యుక్తుఁ డనికేతనుం డెవ్వఁ
డతఁడు ప్రియుఁడు నా కహర్నిశంబు. 312

వ. మఱియు నెవ్వరు మత్పరులై శ్రద్ధధానులై నాచేత నిష్క
డెఱింగింపంబడిన యీ యమృత స్వరూప భక్తి ధర్మంబు
నుపాసింతు రట్టిపరమభక్తులు నా కత్యంత ప్రియు లగుదు
రని యిట్లు ద్వాదశాధ్యాయంబునందు భగవద్భక్తియోగం
బుపదేశించి గోవిందుండు వెండియు నిట్లనియె. 313

## త్రయోదశాధ్యాయము, క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము.

క. క్షేత్రం బగు నీదేహము
క్షేత్రము దెలిసినయతండె క్షేత్రజ్ఞుఁ డగుఁ
సూత్రంబుగఁ దద్వేత్తలు
క్షేత్రక్షేత్రజ్ఞ విధముఁ జెప్పిరి తెలియన్. 314

క. క్షేత్రము లన్నిటియందును
క్షేత్రజ్ఞుఁడ నగుదు నేను జెలువుగ క్షేత్ర
క్షేత్రజ్ఞవివేకమె నృప
పుత్రా జ్ఞాన మనియేను బుద్ధిఁ దలంతున్. 315

శా. క్షేత్రం బెయ్యది యద్వికారి యగుచుఁ జెల్వొందు నెట్లుండు
నా, క్షేత్రం బెవ్వనిచేత నెవ్విధమునఁ సృష్టింపఁగా నయ్యె
నా, క్షేత్రజ్ఞుం డన నెవ్వఁ డెట్టి మహిమఁ జెల్వొందు వాఁ
డింతయుఁ, బుత్రా! నీ కెఱిఁగింతు సూక్ష్మముగఁ దద్బోధంబు
నాలింపుమా. 316

గీ. వరుస నీయర్థము మహర్షి వరులచేతఁ
దగు శ్రుతులచేత హేతుమంతంబులైన
బ్రహ్మసూత్రపదములచే బహువిధములఁ
బరఁగ వేర్వేఱఁజెప్పంగఁ బడియె ననఘ. 317

### క్షేత్రలక్షణము

వ. అర్జునా పృథివ్యాది పంచభూతంబులును శ్రోత్రాదిజ్ఞానేం
ద్రియ పంచకంబును వాగాది కర్మేంద్రియపంచకంబును
శబ్దాది విషయపంచకంబును మనంబును బుద్ధియు నహం
కారంబును బ్రకృతియుఁ గామంబును గ్రోధంబును సుఖం

బును దుఃఖంబును సంఘాతంబును జిత్తవృత్తియు ధైర్యంబు నివియన్నియుంగూడి క్షేత్రం బగునది సవికారంబనంబడు.

## క్షేత్రజ్ఞలక్షణము

మఱియు మానదంభంబులు లేకపోవుటయు హింసారాహిత్యంబును క్షాంతియు నార్జవంబును యాచార్యుల నుపాసించుటయు శుచిత్వంబును స్థిరత్వంబును మనోనిగ్రహంబును విషయాదులయందు విరాగిత్వంబును నహంకార వర్జనంబును జన్మమరణ జరావ్యాధి దుఃఖంబులయందు దోష దర్శనంబును బుత్ర దార గృహ క్షేత్రంబులయం దాసక్తి లేక పోవుటయు నిష్టానిష్ట లాభంబులయందు నిత్యంబు సమ చిత్తంబు గలుగుటయు ననన్యంబైన యోగంబుచేత నా యందుఁ జలింపని భక్తియు విజనప్రదేశం బాశ్రయించు టయు జనసమూహంబుల యందును రాగవర్జనంబును నధ్యాత్మజ్ఞానంబునందు నిత్యత్వంబును దత్త్వజ్ఞానార్థ సందర్శనంబు నిది మదీయ జ్ఞానం బని చెప్పంబడు. దీనికంటె నన్యం బెద్దిగల దది యజ్ఞానం బింక నెద్దాని నెఱింగి నరుండు మోక్షంబు నొందు నెయ్యది తెలియఁ దగిన యది దాని నెఱింగించెదవినుము. ౬18

సీ. అనఘ పరబ్రహ్మ మది యనాదియు నది
సత్తుగాదరయ నసత్తుగాదు
పరఁగ నంతటఁ బాణిపాదశిరోముఖ
కర్ణ నేత్రంబులు గలిగి సర్వ
మావరించి యనంతమై యుండు మఱియు స
ర్వేంద్రియగుణముల నెపుడు చాల

నలరుచుండియు నింద్రియ పరివర్జితుఁడునై
సర్వభృద్వ్యాపుఁడై యసంగుఁడగుచుఁ
తే. బొసఁగ నిర్గుణుఁడై గుణభోక్త యగుచుఁ
గరములో వెలిఁ గదులుచుఁ గదలకుండు
దూరగతుఁ డయ్యుఁ డగ్గఱఁ దోఁచుచుండు
బరమసూక్ష్మమౌటఁ దెలియఁబడఁడతండు. 319

గీ. తలఁప నవిభక్తుఁ డయ్యు భూతములయందుఁ
గడువిభక్తుఁడై యున్నట్లుగానుపించు
భూతభర్తయు జ్ఞేయుండు పోషకుండు
మఱియుఁ బ్రభవిష్ణుఁడు గ్రసిష్ణుఁ డరసిచూడ. 320

గీ. అతఁడు తేజంబులకుఁ దేజ మతఁడు ప్రకృతి
కన్నఁ బరుఁడును జ్ఞేయంబు జ్ఞానమతఁడు
జ్ఞానగమ్యుఁడు సర్వహృత్సంస్థితుండు
సర్వభూతాశ్రయుం డనాశ్రయుఁ డతండు. 321

గీ. అనఘ క్షేత్రస్వరూపంబు నట్లు జ్ఞాన
రూపమంతయు జ్ఞేయస్వరూప మెల్లఁ
జెప్పఁబడె నాదుభక్తుండు చెలఁగి దీనిఁ
దెలసి మద్భావమును బొందఁ గలఁడు పార్థ. 322

### జీవప్రకృతి కార్యములు

గీ. ప్రకృతి పురుషులు నిరువురు పరఁగనాది
లేనివారిని దెలియుము మానసమున
మునుకొని వికారములు గుణములును బ్రకృతి
వలనఁ బొడమినవానిఁగాఁ దలఁపు మనఘ. 323

గీ. కార్యకారణ కర్తృత్వకరణమందు
ప్రకృతి కారణ మని చెప్పఁబడియెఁ బురుషు
డట్లు సుఖదుఃఖ భోక్తృత్వమందు హేతు
వనుచు బుధులు నిర్దేశించి రనఘ చరిత. 324

క. ప్రకృతిగతుండై పురుషుఁడు
ప్రకృతివలనఁ బొడముగుణములం బ్రాపించున్
బ్రకృతిగుణసంగమముఁ బా
యక సదసజ్జన్మ హేతు వగునతని కిలన్ 325

క. మఱియు నుపద్రష్టయును నీ
శ్వరుఁడును మోదకుఁడు భోక్తయుఁ బరుఁడున్
బరమాత్మ యనుచుఁ బురుషుఁడు
బరువడి నీదేహమందుఁ బలుకఁ బడు నరా. 326

క. ధర నెవ్వఁ డిట్లు పురుషుని
వరమతి గుణసహితమైన ప్రకృతి నెఱుఁగు న
న్నరుఁడు బహుగతుల నుండియు
మరలజనింపఁడు ధరిత్రి మఘవతనూజా. 327

పరమాత్మను గాంచువారు

క. ధరఁ గొందఱు ధ్యానముచేఁ
బరమాత్మను బుద్ధియందుఁ బరికింతురు కొం
దఱుసాంఖ్యముచేఁ గొందఱు
పురుషవరా కర్మయోగమునఁ గాంతు రొగిన్. 328

—॥ ఉపదేశంబుచేతనే తరించువారు ॥—

గీ. ధరణిఁ గొంద ఱీమార్గంబు నెఱుఁగ కొరుల
వలన విని దా రుపాసింతు రలఘుభక్తి
శ్రుతిపరాయణు లైనవారును దురంత
మృత్యుసంసారవార్ధిఁ దరింతు రనఘ. 329

క. ఇలఁ జర మచరం బైనను
బలుకొంచెం బైన నెంతవస్తువు గలుగున్
దలఁపఁగ క్షేత్ర క్షేత్ర
జ్ఞులసంయోగమున నది యగున్ బాండుసుతా. 330

సీ. సకల భూతములందు సమత నుండి మహేశ్వ
రుం డవి నశియింపుచుండఁ దాను
నశియింపఁ డట్టులు నాశరహితునిగా
వరబుద్ధి నతని నెవ్వాఁడు చూచు
నతఁడు చూచు సమత్వ మలవడ సర్వభూ
తములయం దున్నబ్రహ్మమును నిత్య
మట్లు చూచుచు నాత్మ నాత్మచేఁ జంపక
పండితుం డగువాఁడు పరమునొందుఁ

తే. ప్రకృతిచేతనె సర్వకర్మము లొనర్పఁ
బడుచు నున్నవి దీనికి బ్రహ్మ మేమి
కర్తగాఁ డమ్మహాత్ముఁ డకర్త యనుచు
నెఱుఁగు నట్టివాఁడే యాత్మ నెఱుఁగు ననఘ. 331

గీ. ఇల సమస్తభూతముల భిన్న భావంబు
నొక్కదానియందు నున్నదానిఁ

గాఁగ నెపు డెఱుంగు యోగి యప్పుడు బ్రహ్మ
భూతుఁ డగుచునుండుఁ బుడమియందు. 332

బ్రహ్మంబు నిర్గుణం బనుట.

గీ. అవ్యయుం డైనపరమాత్మ యఖిల తనువు
లందు నుండియు నిర్గుణుం డగుటవలన
నాదిమధ్యాంతవిరహితుం డగుటవలన
నేమిసేయఁడు మరి యంటఁ డేమి యనఘ. 333

గీ. సురపథము సర్వగత మయ్యు సూక్ష్మ మగుట
వలన నెట్లు సంబంధింపఁ బడక యుండు
నట్లు సర్వశరీరస్థుఁ డయ్యు నాత్మ
దగులువడఁ డెందును గిరీటి తథ్య మింత. 334

క. రవి యొక్కఁ డెవ్విధంబున
వివిధజగంబులను జాల వెలుఁగఁగఁ జేయున్
భువి నటు క్షేత్రజ్ఞుండును
వివిధక్షేత్రముల నెల్ల వెలుఁగఁగఁ జేయున్. 335

వ. మరియు నిట్లు జ్ఞాననేత్రంబుచే క్షేత్రక్షేత్రజ్ఞులతారతమ్యంబును భూతప్రకృతిమోక్షణంబు నెవ్వ రెఱుంగుదు రట్టివారు పరమసిద్ధి వడయుదు రని యిట్లు త్రయోదశాధ్యాయంబునందుఁ బ్రకృతిపురుషవివేకయోగం బుపదేశించి వెండియుఁ బుండరీకాక్షుం డర్జునుం జూచి ధనంజయా మునీంద్రు లెద్దాని నెఱింగి యింతకంటె నుత్కృష్టం బైన పదంబుఁ బ్రాపించి రట్టిజ్ఞానంబు గ్రమ్మఱ నుపదేశించెద నది సర్వజ్ఞానంబులలో నుత్తమంబై యుండు నీజ్ఞానంబు నాశ్రయించినవారలు మత్స్వరూపత్వంబు నొంది గ్రమ్మఱ సర్గంబు

నందుం బొడమరు ప్రళయంబునందు దుఃఖింప రదియెయ్యది
యనిన వినుము. 336

## చతుర్దశాధ్యాయము, గుణత్రయవిభాగయోగము

ప్రకృతిపురుషులు జగంబులకుఁ దల్లిదండ్రు లనుట

క. విను మత్ప్రకృతి జగంబున
కనిశము కారణము దానియం దొగి గర్భం
బును దాల్తు నేను దానం
జనియించు సమస్తభూతసంఘము వత్సా. 337

క. నరసర్వయోనులం దు
ద్వర నేమూర్తులు జనించు వానికి నెల్లన్
బరఁగఁ బ్రకృతి కారణ మం
దఱికే బీజం బొసంగు తండ్రిని జుమ్మీ. 338

సత్త్వరజస్తమోగుణవిభాగములు

క. అనఘా ప్రకృతివలనఁ బు
ట్టిన సత్త్వరజస్తమోభిధేయగుణంబుల్
తను వందు సంతతంబును
వినాశరహితుఁ డగుపురుషు వెస బంధించున్. 339

గీ. కురుకులవరేణ్య యస్మూఁడు గుణములందు
సత్త్వ మతినిర్మలం బౌట సత్ప్రకాశ
కం బయి యనామయం బయి గాత్రమందు
జ్ఞానసుఖములచే దేహిఁ గట్టివైచు. 340

గీ. అనఘచరిత తృష్ణాసంగజనిత మయిన
రజము రాగస్వరూపమై గ్రాలుచుండు

నది శరీరిని బంధించు ననవరతము
కర్మసంగంబుచేత నీకాయమందు. 341

గీ. అఖిలదేహిసమ్మోహన మైనయట్టి
తమము నజ్ఞానజం బని దానిఁ దెలియ
తగఁ బ్రమాదనిద్రాలసత్వములచేత
నది శరీరిని బంధించు నంగమందు. 342

క. వినుము సుఖమందు సత్త్వం
బనవరతము రజము కర్మమందుఁ దమము చ
య్యనఁనాత్మపరిజ్ఞానము
చనఁ జేసి ప్రమాదమందుఁ జాల వెలుంగున్. 343

గీ. రజమును దమోగుణంబు నిరాకరించి
సత్త్వ మలరారు మరి రజస్సత్వముల ని
రాకరించి తమం బొప్పు వీఁకఁ దమము
సత్త్వము నిరాకరించి రజంబు చెలఁగు. 344

సీ. రహిం మీ-ఱ మేన సర్వద్వారములయందు
జ్ఞానప్రకాశంబు గలుగు నెప్పు
డపుడు సత్త్వోద్రేక మని యెఱుంగుము దాని
వెలయ రజం బభివృద్ధి నొంద
నపుడు లోభంబు కర్మారంభమును గామ
మశమంబు జనియించు నట్లు తమము
వృద్ధిఁ బొందిన నప్రవృత్తియు మోహంబు
కడుఁ బ్రమాదం బప్రకాశతయును

చచ్చునప్పు డేగుణం బున్న నాజన్మంబు వచ్చు ననుట

తే. గలుగు నెప్పుడు సత్త్వంబు గడుఁ బ్రకాశ

మొందు నప్పుడు దేహి తా నొడలిఁ బాసి
చనియె నేని యతండు ప్రశాంతుఁ డగుచు
నుత్తమజ్ఞులలోకంబు నొందు ననఘ. 345
మొనసి రజమందు మృతుఁడై
చనిననరుఁడు పుట్టుఁ గర్మసంగులయందుఁ
వినుము తమమందు గెడసిన
జనుఁ డటు పశ్వాదులందు జనియించు నిలన్. 346
సుకృతకర్మంబునకుఁ బరిశుద్ధమయిన
ఫలము సాత్త్వికమందురు పరఁగ దుఃఖ
మది రజోగుణఫల మండ్రు సవమలాత్మ
వరుస నజ్ఞాన మది తమగఫలము సుమ్మి. 347
అమలసత్త్వంబువలన జ్ఞానము జనించు
రాజపుత్త్రి లోభము పుట్టు రజమువలనఁ
దమమువలన నజ్ఞాన మెంతయుఁ బ్రమాద
మోహములుఁ బుట్టు నిజ మింత మోహదూర. 348
ఒనర సత్త్వస్థు లగుపుణ్యు లూర్ధ్వగతికిఁ
జనుదురు రజోగుణస్థులు మొనసి మధ్య
గతి గమింతురు తామసుల్ కడుజఘన్య
కర్ములై పోదు రిల నధోగతికి వత్స. 349
అర్జున విను ద్రష్ట యగువాఁడు గుణముల
కంటెఁ బరుం డైనకర్తగాఁగ
నను విలోకింపక నయముతో గుణముల
కంటె నన్యునిగాఁగఁ గాంచు నతఁడు
మద్భావమును బొందు మరియు దేహసముద్భ

వములైన యీ త్రిగుణముల దాఁటి
రహిఁ జన్మమృత్యుజరాదుఃఖములచేత
ముక్తుఁడై మనుజుఁడు ముక్తి నొందు
ననిన విని యర్జునుండు మురారిఁ జూచి
దేవ యేహేతువులచేతఁ ద్రిగుణములను
గడచు నెట్టియాచారంబు గలిగి వీని
దాఁటఁగా వచ్చు నాకు నింతయును జెపుమ. 350

త్రిగుణాతీతులక్షణము

వ. అని యడిగిన భగవంతుం డర్జునుం జూచి పాండునందనా సత్త్వగుణచిహ్నం బయిన ప్రకాశంబును రజోగుణచిహ్నం బయిన ప్రవృత్తియుఁ దమోగుణచిహ్నం బయినమోహంబు నిమ్మాఁడు ప్రవర్తింపుచుండ నెవ్వండు ద్వేషింపకుండు, నవి నివర్తింపుచుండ నెవ్వండు కాంక్షింపకుండు నతండు త్రిగుణాతీతుం డనం బరఁగు మఱియు. 351

సీ. ధరలోన నెవ్వఁ డుదాసీనుచందాన
నుండి గుణంబుల నొగిఁ జలింపఁ
డెవ్వాఁడు తమయంత నీగుణంబులు ప్రవ
ర్తింపుచున్న పటంచుఁ దెలిసి చలన
మొందక సుస్థితి నుండు నెవ్వాఁడు దుఃఖ
సుఖములు గర్హణస్తుతులు కాంచ
నాశ్మలోష్టములు మానావమానములు ప్రి
యాప్రియంబులును మిత్రారిపక్ష
తే. ములు సమంబుగ మనములోపలఁ దలఁపుచుఁ
గలఁక మాని సర్వారంభములను విడిచి

సరవి నెవ్వియు నంటక స్వస్థుఁ డగుచు
నలరు నతఁడు గుణాతీతుఁ డనఁగఁ బరఁగు. 352

వ. మఱియు ననన్యంబైనభక్తియోగంబుచేత నెవ్వఁడు నన్ను సేవించు నతండు డీప్రకృతిగుణంబుల నతిక్రమించి బ్రహ్మమయుం డగుటకు సమర్థుం డగు నేను బ్రహ్మంబునకు మోక్షంబునకు నక్షరంబునకు శాశ్వతం బయినధర్మంబునకు ముఖ్యం బయినసుఖంబునకు నాశ్రయుఁడ నగుదు నని యిట్లు చతుర్దశాధ్యాయంబునందు గుణత్రయవిభాగయోగం బుపదేశించి ముకుందుండు వెండియు నిట్లనియె.

## పంచదశాధ్యాయము, పురుషోత్తమప్రాప్తియోగము

సంసారవృక్షవివరణము

భారతోత్తమా ఛందంబు లెద్దానివర్ణంబు లగు నట్టి యశ్వత్థం బొక్కటి గలదు దాని మూలంబు లూర్ధ్వగతంబులై కొమ్మ లధోగతంబులై యుండు దాని నాశంబు లేనిదానిఁగా నొడువుదు రెవ్వఁడు దాని నెఱుంగు నతండు వేదవిదుం డనం బరఁగు దాని శాఖలు సత్త్వాదిగుణంబులచేతఁ బ్రవృద్ధంబులై శబ్దాదివిషయంబు లనుపల్లవంబులు గలిగి క్రిందికి మీఁదికిం బ్రసరించియుండుఁ దన్మూలంబు లధోగతంబులై మనుష్యలోకంబు నందుఁ గర్మానుబంధంబులై యొప్పు దాని కాది మధ్యాంతంబులు లేవు గావున. 353

సంసారవృక్షఖండనము

సీ. మునుకొని సువిరూఢమూలమై యొప్పు నీ
యశ్వత్థమును దృఢ మగు నసంగ

వరకుతారంబుచే నటికి యవ్వల నరు
లెద్దాని బ్రాపించి యించుకైన
గ్రమ్మఱ రా రట్టిఘనతరపరమప
దంబు నన్వేషింపఁ దగుఁ గిరీటి
వల నొప్ప నెవ్వనివలనఁ బురాణిరై
నట్టిప్రవృత్తి యొప్పారు నట్టి

తే. యాద్యుఁడై యొప్పు పురుషు నే నధిగమింతుఁ
గామసమ్మోహమానసంగములు విడిచి
యాత్మ నిత్యులై యద్వంద్వులై తనర్చు
నట్టి సుజ్ఞాను లొందుదు రవ్యయంబు. 354

గీ. మనుజు లెద్దానిఁ బ్రాపించి మరలఁ బుట్ట
రట్టి పదమును సూర్యశశాంకవహ్ను
లాత్మరుచుల దీపింపఁ జేయంగఁ జాల
రదియె నాకు సముత్కృష్టమయిన పదము. 355

జీవసృష్టిక్రమము

క. మానుగ జగతిఁ బురాణం
బై నమదంశంబె జీవుఁడై ప్రకృతి గత
జ్ఞానేంద్రియపంచకమును
మానసమును బట్టి తిరుగుచు మానక యెపుడున్. 356

గీ. ఏతనువు నీశ్వరుఁడు పొందు నేతనువును
వదలు నట్టి శరీరంబువలన వీని
నరవి గైకొని యేఁగు నాశయమువలన
ననిలుఁ డటుగంధములు గొని చనినపగిది. 357

గీ. శ్రవణమును స్పర్శనంబును జక్షువులును
మరియు రసనంబు ఘ్రాణంబు మానసమును
దగ నధిష్ఠించి జీవుండు మిగుల సర్వ
విషయముల సంతతంబు సేవింపుచుండు. 358

క. కుడుచుచు నడుచుచు నిలుచుచు
విడుచుచు గుణయుక్తుఁ డగుచు వెలిఁగెడు వానిం
గడుజీవుఁ డని యెఱుంగరు
జడమతు లెఱుఁగుదురు జ్ఞానచక్షువు లనఘా. 359

చ. అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మ
యందు నిశ్చలముగ నున్న వానిఁగ నిజంబు నెఱుంగుదు
రజ్ఞులైన నిశ్చలమతిహీను లొక్కమొగిఁ జాలఁ బ్రయ
త్నముఁ జేసియుఁ సముజ్జ్వలుఁ డగునీశ్వరుం దెలియఁ
జాలరు భారత నిక్కమింతయున్. 260

— { సూర్యాదులందుఁ గల తేజోధారణాదులు భగవంతుని వలననే గల్గుననుట } —

గీ. అనఘ యే తేజ మాదిత్యు నాశ్రయించి
జగము నంతయు వెలిఁగించుఁ జంద్రునందు
ననలునందు నే తేజంబు దనరియుండు
దాని మత్తేజమునుగాఁగ దలఁపు మెపుడు. 361

చ. ధరణినిఁ బొంది భూతములఁ దద్దయుఁ దేజముచే ధరింపుదుఁ
సరవి రసస్వరూపుఁ డగుచంద్రుఁడనై మొలిపింతు నోషధుల్
సురుచిరవహ్నినై యొడలు సొచ్చి వెసం బచనంబు సేయుదుఁ,
వరుసఁ జతుర్విధంబులుగఁ బ్రాణ మపానముఁ గూడి
యన్నమున్. 362

శా. ప్రాదుర్భూతసమస్తమానసములన్ వర్తింతు నశ్రాంతమున్
వేదజ్ఞుండను వేదవేద్యుఁడ రహిన్ వేదాంతకారుండ నీ[కాం,
క్షాద్యదంభంబు లపోహనంబును స్మృతిజ్ఞానంబులున్ మోహ
తాదర్పంబులు నిన్ని నావలననే జన్మించె శక్రాత్మజా. 363

—— క్షరాక్షరాతీతనిరూపణము ——

క. క్షరుఁ డన నక్షరుఁ డనఁగా
పురుషులు గల రిద్ద అందు భూతములెల్లన్
క్షరుఁ డందురు కూటస్థుని
నిరవుగ. నక్షరుఁ డటంచు నెన్నుదు రుర్విన్. 364

గీ. అనఘ యెవ్వఁడు లోకత్రయమున నుండి
యఖిలభారంబును వహించు నట్టిపురుషుఁ
డన్యుఁ డుత్తముఁ డీశ్వరుం డవ్యయుండు
పరఁగఁ బరమాత్మ యని చెప్పఁబడుఁ గిరీటి. 365

గీ. తలఁప నేను క్షరాక్షరంబులను దాఁటి
యవ్వల వెలుఁగువాఁడ నట్లగుటఁ జేసి
కడఁగి వేదంబుచేత లోకంబుచేతఁ
బుడమిఁ బురుషోత్తముం డనఁ బొగడు గంటి. 366

గీ. మోహ మొందక యెవ్వాఁడు పుడమి నన్ను
వెలయఁ బురుషోత్తమునిగాఁగ దెలియు నతఁడు
పరఁగ సర్వజ్ఞుఁ డగు సర్వభావములను
నన్ను భజియించు నిత్యంబు నయచరిత్ర. 367

వ. పాండవోత్తమా యీగుహ్యంబైన శాస్త్రం బిట్లు నాచేత
నెఱింగింపంబడియె దీని నెఱింగినవాఁడు బుద్ధిమంతుండును
గృతార్థుండు నగు నని యిట్లు పంచదశాధ్యాయంబునందుఁ

బురాణ పురుషోత్తమయోగం బుపదేశించి వాసుదేవుండు
వెండియు నిట్లనియె. 368

## షోడశాధ్యాయము, దైవాసురసంపద్విభాగయోగము

దైవసంపద - ఆసురసంపద

సీ. స్వాధ్యాయ మభయంబు సత్త్వసంశుద్ధియు
దానంబు యజ్ఞంబు తపము దమము
క్షాంతియు జ్ఞానయోగవ్యవస్థితియు నా
ర్జవమును సత్యంబు శమము త్యాగ
మక్రోధమును శౌచ మఖిలభూతములందు
దయయు నహింసయు నియమశుద్ధి
ధైర్యం బలోలుపత్వ మచాపలంబును
క్షమయును దేజంబు గర్వవర్జ
తే. నంబు మృదుభావము నపైశునంబు ద్రోహ
చింతలేమియు హ్రీయును జిత్తశుద్ధి
పరఁగ నివి దైవియైన సంపదను గుడువ
జగతిఁ బుట్టినవారికి నగుఁ గిరీటి. 369

గీ. మరియు నాసురియైన సంపదను గుడువ
నవనిఁ బుట్టిన వారికి నగుఁ బ్రమాద
రోషదర్పాభిమాన పారుష్యదంభ
ములును గామమోహాజ్ఞానములుఁ గిరీటి. 370

గీ. దైవసంపద మోక్షంబు తగ నొసంగుఁ
బరఁగ నాసురసంపద బంధమొసఁగుఁ
బుడమి దైవసంపదఁ గూర్చి మిట్టి తీవు
వ్యసన మొందకు మింత సత్యంబు పార్థ. 371

క. దైవం బన నాసురమన
వావిరి సర్గములు రెండు వఱలుఁ బుడమిలో
దైవంబు చెప్పఁబడియెను
ధీవర యాసురము నింకఁ దెలిపెద వినుమా. 372

క. పరఁగఁ బ్రవృత్తినివృత్తుల
నరయంగ నెఱుంగ రవని నాసురజనముల్
మరి వారియందు నుండవు
సరసత నాచారసత్యశౌచము లనఘా. 373

గీ. కామహేతుకంబు కరము పరస్పర
జాత మన్య మేమి జగతి లేదు
జగ మనీశ్వరం బసత్యంబు నప్రతి
ష్ఠిత మఁటంచు వారు చెప్పి రనఘ. 374

క. అని యిటు బుద్ధిఁ దలంపుచు
మునుకొని దుష్టాత్మ లల్పబుద్ధులు క్రూరుల్
జనియింతు రుర్విలోపల
ననిశము లోకక్షయార్థ మహితాత్మకులై. 375

సీ. అనఘ దుష్పూరకామాశ్రయులై గత
జ్ఞానులై దుష్పరిగ్రహముఁ జేసి
యపరిశుద్ధవ్రతులై దంభమానమ
దాన్వితులై యుందు రవని మరియు
నంతపర్యంతంబు నమితచింతాసక్తు
లై కామభోగంబు లనుభవింపఁ
దవిలి వారింతమాత్రము నిశ్చయించుక
బహుళతృష్ణాపాశబద్ధు లగుచు

తే. సాంద్రకామరోషములందు సక్తులగుచు
నఖిలకామభోగంబుల ననుభవింపఁ
దలఁచి యన్యాయముగఁ బరద్రవ్యములను
సతత మార్జింపుచుందురు సవ్యసాచి. 376

సీ. ఈమనోరథ మిప్పు డేను బొందితి నింక
విడువ కీకోరికఁ బడయువాఁడ
నిది నాకుఁ గలదిప్పు డీఁకమీఁదఁ గ్రమ్మఱఁ
దరల కీవిత్త మంతయు లభింతుఁ
బరఁగ నాచేత నీపగతుఁడు హతుఁ డయ్యెఁ
జంపెదఁ దక్కిన శత్రువులను
నేబలవంతుఁడ నేను భోగిని సుఖి
నేను సిద్ధుండ నే నీశ్వరుండ

తే. నేను సత్కులవంతుండ నేను ధనిని
వసుధ నాకు సమానుఁడెవ్వాఁడు గలఁడు
సవన మొనరింతు నొసఁగుదు సంతరింతు
ననుచు నిబ్భంగిఁ బలుకుదు రజ్ఞు లగుచు. 377

గీ. బహువిధనితాంతచిత్తవిభ్రాంతి గలిగి
మోహపరివృతు లై కామభోగసక్తు
లగుచు నపవిత్ర మయిన దురంతఘోర
నరకమునఁ గూలుదురు వారు నయచరిత్ర. 378

క. ధనమానమదాన్వితులై
గొనకొని తముఁ దామె పొగడుకొనుచు భువి మఖం
బొనరింతురు దురహంకృతి
మునుకొని దంభమునఁ బేరు వొందుటకొఱకై. 379

నన్ను ద్వేషించు వారలకు నీచజన్మాములు గలిగింతు ననుట

క. బలదర్పాహంకారం
బులఁ గామక్రోధములను బొంది యసూయన్
దలకొని నను ద్వేషింపుదు
రలుకం దమయందు నొరులయం దనిశంబున్. 380

సీ. అట్టి క్రూరమతుల నశుభుల వైరుల
మానుషాధములను మాన కేను
భవముఁ దొలఁగ నీక పట్టి యాసురయోను
లందు వైతుఁ గౌరవాగ్రగణ్య. 381

గీ. అసురయోనుల నిబ్భంగి నధిగమించి
మొనసి జన్మజన్మంబున మూఢు లగుచు
నెలమి నన్నెన్నఁడును భజియింప కవల
నధమగతి కేఁగుదురు వార లనఘచరిత. 382

గీ. తివిరి లోభంబు కామంబు ద్వేష మనఁగఁ
నరయ మూఁడు వాకిళ్లగు నరకమునకు
మించి యాత్మనాశంబు గావించు నివి వి
వేకులగు వార లిమ్మూటి విడువవలయు. 333

క. వరుసఁ దమోద్వారములై
పరఁగెడునిమ్మూటి విడిచి ప్రాజ్ఞుఁడు తనకుం
బరమశ్రేయము సేయుచుఁ
బరమగతిం బొందు నవలఁ బాండుకుమారా. 334

గీ. పృథివి నేమానవుఁడు శాస్త్రవిధిని విడిచి
మించి తనయిచ్ఛకొలఁదిఁ జరించు వాని

కిద్ధర సుఖంబులే దాత్మసిద్ధి లేదు
పరమగతి లేదు నిక్కంబు పాండవేయ. 385

వ. కావునఁ గర్తవ్యాకర్తవ్య నిశ్చయంబునందు నీకు శాస్త్రంబే ప్రమాణంబు శాస్త్రవిధానంబుచేత నుడువంబడినదాని నెఱింగి యిచ్చటఁ గర్మంబు గావింపు మని యిట్లు పదియాఱవయధ్యాయంబు నందు దైవాసురసంపద్విభాగ యోగం బుపదేశించిన విని గుడాకేశుండు హృషీకేశుం జూచి దేవా శాస్త్రవిధిని బరిత్యజించి శ్రద్ధాసమన్వితులై యజ్ఞంబులు సేయుదు రెవ్వ రట్టివారికి నిష్ఠయెయ్యది యది సత్త్వంబో రజంబో తమంబో యెఱింగింపు మని ప్రార్థించిన భగవంతుం డిట్లనియె. 336

## సప్తదశాధ్యాయము, శ్రద్ధాత్రయవిభాగయోగము

సత్త్వరజస్తమోగుణ స్వరూపము

గీ. అనఘ దేహిస్వభావజం బైనశ్రద్ధ
మూఁడువిధములు గలదియై మొనయుచుండు
సాత్త్వికి యనంగ మరియు రాజసి యనంగఁ
దామసి యనంగఁ జెప్పెద దాని వినుము. 337

సాత్త్వికరాజసతామసులు సేయుపూజాభేదములు

సీ. సర్వమానవులకు స్వస్వభావమునకుఁ
దగిన శ్రద్ధయుఁ గల్గి దనరుచుండు
జగతి నీపురుషుండు శ్రద్ధామయుం డగు
నెవ్వాని కే శ్రద్ధ నివ్వటిల్లు
నతఁ డీధరిత్రిలో నా శ్రద్ధగలవాఁడు
సాత్త్వికుల్ దేవపూజన మొనర్తు

రరుదార రాజసుల్ యక్షరాక్షసులను
దవిలి భజింతురు తామసులును

తే. ప్రేతభూతంబులను బూజసేతు రెపుడు
కామదర్పమద ద్వేషకలితు లగుచు
విధిహితము గానితపము గావించువార
లసురసంబంధనిశ్చయు లని తలంపు. 388

గీ. మరియు నవివేకులై దేహమధ్యగతుఁడ
నైననన్ను భూతంబుల ననుదినంబు
నెవ్వరు కృశింపఁజేతు రాహీనబుద్ధు
లసురసంబంధనిశ్చయు లని తలంపు. 389

వారియాహారభేదములు

క. సవనతపోదానంబులు
భువి నాహారంబుఁ జూడ భోజనములకున్
ద్రివిధంబు లగుచు నుండును
వివరించెద వాని తెఱఁగు వినుము కిరీటీ. 390

గీ. ఆయురారోగ్యబలసత్త్వహర్షసుఖవి
వర్ధనంబులు స్నిగ్ధముల్ స్వాంతహరము
లటుల రస్యంబులైన యాహారము లవి
కౌరవోత్తమ వినుసాత్త్వికప్రియములు. 391

గీ. పరఁగ దుఃఖశోకామయప్రదములైన
కటులవణతిక్తతీక్ష్ణరూక్షప్రదాహ
కారణోష్ణంబులైనయాహారము లవి
శక్రనందన విను రాజసప్రియములు. 392

గీ. యాతయామంబు గతరసం బపరిశుద్ధ
మధికదుర్గంధ ముచ్ఛిష్ట మనుచితంబు
పర్యుషితమైన యన్నంబు పరఁగ నెపుడు
జగతిలోపల నిది తామసప్రియంబు. 393

— వారియజ్ఞభేదములు —

వ. మరియు ఫలకాంక్షులు గానివారిచేత శాస్త్రదృష్టవిధానంబునఁ గావింపంబడునట్టియజ్ఞంబు సాత్త్వికయజ్ఞంబు ఫలంబు గోరి దంభార్థంబుగా నెయ్యది గావింపంబడు నట్టియజ్ఞంబు రాజసయజ్ఞంబు శ్రద్ధాయుక్తుండు గాక శాస్త్రం బెఱుంగక యన్నం బొసంగక దక్షిణ లిడక మంత్రహీనంబుగాఁ గావించునట్టియజ్ఞంబు తామసయజ్ఞంబు ఇవి త్రివిధయజ్ఞంబులు నీకెఱింగించితి నింక త్రివిధతపంబు లెఱింగించెద వినుము.

— పై వారివె కాయిక మానసిక వాచిక తపస్సులు —

క. గురుదేవప్రాజ్ఞద్విజపరిపూజా బ్రహ్మచర్యపరశౌచంబుల్ [ప్పున్.
గరిమనహింసార్జవములుధరఁగాయిక తపమనంగఁదద్దయు నొ

క. అనఘా సత్యము ప్రియహిత
మను వొందఁగ దుఃఖరహిత మయిన వచనముల్
ఘనతర వేదాధ్యయనం
బన నివి వాచికతపంబు హరిహయపుత్రా! 396

క. మానసశాంతియు సౌమ్యము
మానం బాత్మావరోధమానసశుద్ధుల్
మానుగ నివి చర్చింపఁగ
మానసతప మనఁగఁ జెల్లు మహిఁ బాండుసుతా. 397

గీ. ఉర్వి ఫలకాంక్ష లేకయే యోగిజనులు
చెలఁగి శ్రద్ధాసమేతులై సేయునట్టి
యీ త్రివిధమైనతపమె సురేంద్రపుత్త్ర
ధరణి సాత్త్వికతపము నా వఱలుచుండు. 398

గీ. అనఘ సత్కారమానపూజార్థ ముర్వి
దంభబుద్ధిఁ గావించెడుతపము చూడ
రాజసతపంబు నా నొప్పు రాజపుత్ర
పరఁగ నిది చలనం బధ్రువంబు సుమ్మి. 399

గీ. చపలమతి నవివేకనిశ్చయముచేత
నైనఁ బరిపీడనంబుచే నాత్మశత్రు
నిరసనార్థంబు గావించు నీచతపము
జగతిఁ దామసతప మగు సవ్యసాచి. 400

వారిదానములు

గీ. దేశకాలపాత్రంబులు దెలిసి యనుప
కారికొఱ కిది యొసఁగుట కార్య మనుచుఁ
దలఁచి భక్తి నొసంగినదాన మనఘ
దనరు భువిలోన సాత్త్వికదాన మనఁగ. 401

గీ. ధరణిఁ బ్రత్యుపకారంబుకొఱకుఁ గాని
మరియు ఫలమును బ్రాపించుకొఱకుఁ గాని
తవిలి ఖేదంబుగాఁగ నెద్దాని నొసఁగు
నట్టి దానంబు రాజసం బండ్రు బుధులు. 402

గీ. కడఁగి దేశంబు కాలంబు గానిచోటఁ
బ్రీతిచే సత్కరింపక నీతి మాని

కసరి వైచుచు నెద్దాని నొసఁగునట్టి
దాన మది తామసం బగు దండితారి. 403

## ఓంతత్సచ్ఛబ్దప్రయోగవిధులు

సీ. వసుధలోఁ బ్రణవపూర్వకముగా నిది సత్య
మనియెడు నిర్దేశ మాత్మ కెపుడు
త్రివిధమై స్మృత మగుఁ దెలిఁగొప్ప దానిచే
మున్ను విప్రులు వేదములును యజ్ఞ
ములుఁ బుట్టెఁ గావున మురుకొని బ్రహ్మవా
దులశాస్త్రగదితక్రతుప్రదాన
తపములు ప్రణవంబు దగ నుచ్చరించి ప్ర
వర్తింపుచున్నవి వదల కెపుడు

గీ. మోక్షకాంక్షులచేత సముత్సుకమున
బహువిధక్రతుదానతపఃక్రియలును
పరఁగఁ దచ్ఛబ్దము స్మరించి ఫలము విడిచి
విడువ కెపుడుఁ బ్రవర్తింపఁబడుఁ గిరీటి. 404

గీ జగతి సద్భావమందును సాధుభావ
మందు సచ్ఛబ్దము ప్రయుక్తమగుచు నుండు
మఱియు నారీతి యోగ్యకర్మంబులందుఁ
బరఁగ సచ్ఛబ్ద మది గూర్పఁబడుఁ గిరీటి. 405

గీ. యజ్ఞదానతపంబులయందు నునికి
పరుస సత్తని చెప్పంగఁ బడియె దానిఁ
బడయఁ గోరినవానిసంబంధకర్మ
మదియు సత్తని చెప్పంగ నగుఁ గిరీటి. 406

వ. మఱియు శ్రద్ధ లేక గావించినహోమంబును నొసంగిన దానంబును దప్తంబయిన తపంబును గృతంబైనకర్మంబును నసత్తని చెప్పంబడు నది యుభయలోకంబులయందు లే దని యిట్లు సప్తదశాధ్యాయంబునందు శ్రద్ధాత్రయ విభాగయోగం బుపదేశించిన విని యర్జునుండు వెండియు జనార్దనుం జూచి మహాత్మా సన్న్యాసతత్త్వంబును ద్యాగ తత్త్వంబును వేర్వేర నెఱుంగ నిచ్ఛయించితిఁ గృపాళుం డవై యానతిమ్మని యడిగిన నాభగవంతుం డతని కిట్లనియె.

## అష్టాదశాధ్యాయము, మోక్షసన్న్యాసయోగము

త్యాగలక్షణము

సీ. విను కామ్యకర్మముల్ విడుచుట సన్న్యాస
మనియుఁ గర్మఫలంబు నట్ల విడుచు
టది త్యాగ మనియుఁ బల్కుదురు తత్త్వజ్ఞులు
జగతిఁ గొందఱు విచక్షణులు కర్మ
మతిదోషము త్యజింప నగు నని పల్కుదు
రందుఁ గొందఱు దానయజ్ఞతపము
లవి త్యజింపంగ రా దని వచింతురు కర్మ
సంపరిత్యాగంబు సాధుజనులు
తే. మూఁడు విధములు గలదిగా నాడి రందు
నాదు నిశ్చయ మెఱిఁగింతు నయముతోడ
యజ్ఞదానతపఃకర్మ మార్యులకుఁ బ
విత్ర మొనరింపఁదగు దాని విడువరాదు, 408

క. తడయక సంగము ఫలమును
విడిచి వివేకజ్ఞుఁ డీత్రివిధకర్మంబుల్

బుడమి నొనరింపఁగాదఁగఁ
విడువక యిది నామతంబు వీరవరేణ్యా. 409

## సాత్త్వికరాజసతామసత్యాగములు

క. విను నియతం బగు కర్మము
మునుకొని విడువంగ రాదు మోహముచేఁ జ
య్యన విడిచెనేని బలభం
జనతనయా యదియుఁ దామసత్యాగ మగున్. 410

గీ. పాండవేయ కాయక్లేశభయమువలనఁ
గర్మ మతికష్ట మని వానిఁ గడఁగి విడుచు
నతని త్యాగంబు రాజసత్యాగ మండ్రు
వాని కుర్విఁ గర్మత్యాగఫలము లేదు. 411

గీ. అనఘ నియతకర్మం బవశ్యంబుసేయ
వలయునది యందు సంగంబు ఫలము విడిచి
కర్మ మొనరించు వానిత్యాగంబు జగతి
సాత్త్వికత్యాగ మందురు సవ్యసాచి. 412

గీ. అనఘ త్యాగియు సత్త్వగుణాశ్రయుండు
సరవి మేధావి ఛిన్నసంశయుఁడునైన
జనుఁ డశుభకర్మమందు ద్వేషంబు నొందఁ
డుర్వి శుభకర్మమున సంగమొందఁ డనఘ. 413

## ఇష్టానిష్టమిశ్రకర్మఫలములు

వ. మరియు దేహధారి యగువాఁ డశేషకర్మంబులు పరిత్య
జించుటకుసమర్థుండు గాఁడు కర్మఫల పరిత్యాగంబు సేయ
నరుఁడే త్యాగి యనంబడుఁ గర్మఫలం బిష్టం బనియు ననిష్టం
బనియు మిశ్రం బనియు మూఁడు దెఱంగులు గలదిగా

నుండు నది ఫలపరిత్యాగులు గాని వారికిఁ బరలోకంబునం గలిగియుండుఁ బరిత్యాగి యగు వాని కుభయలోకంబుల లేదు మరియు సమస్త కర్మసంసిద్ధి కొఱకు సిద్ధాంతం బైన సాంఖ్యశాస్త్రంబునందుఁ బంచవిధ కారణంబులు చెప్పం బడియె వాని నెఱింగించెద వినుము. 414

కర్మసిద్ధి కారణపంచకము

క. వరుస శరీరము కర్తయుఁ
బరఁగఁ బృథగ్విధకరణము బహువిధపృథ
గ్వరచేష్టయు నిన్నాలుగు
మరియుఁ దైవంబు పంచమం బగు ననఘా. 415

గీ. వాఙ్మనఃకాయములచేత వరుస నుర్వి
న్యాయ్యమైనను విపరీతమైన నేమి
వేడ్కతో మానవుండు గావించునట్టి
కర్మమున కివి యైదును గారణములు. 416

గీ. పుడమి నెవ్వఁ డశిక్షితబుద్ధి యగుట
చేత నీయర్థమందు దుశ్చిత్తుఁ డగుచుఁ
దన్నుఁ గర్తనుగా బుద్ధిఁ దలఁచు నట్టి
వాఁడు నారూప మెన్నఁడు జూడఁ డనఘ. 417

అనహంకృతుఁడు బద్ధుఁడు గాఁ డనుట

చ. అనఘ ధరిత్రి నెవ్వని కహంకృతి భావము గల్గకుండు నే
ఘనమతి తత్తదాచరిత కర్మములం దనురక్తి నొందద [బా
య్యనఘుఁడు దాను లోకములనన్నిటిఁ జంపియుఁ జంపకుండుఁ
వనసుచరిత్ర యెన్నఁడును బద్ధుఁడు గాఁడతఁ డెన్ని చూడఁగన్.

వ. పాండునందనా కర్మోపదేశంబు జ్ఞానం బన జ్ఞేయం బనఁ బరిజ్ఞాత యనం ద్రివిధంబై యుండుఁ గర్మసంగ్రహంబు

కరణం బనఁ గర్మం బనఁ గర్త యనఁ ద్రివిధంబై యుండుఁ గాపిలశాస్త్రంబునందు జ్ఞానం బనఁ గర్మం బనఁ గర్త యన గుణభేదంబువలనఁ ద్రివిధంబుగాఁ జెప్పంబడియె. వాని స్వరూపంబు యథార్థంబుగా నెఱింగించెద వినుము. 419

సాత్త్వికరాజసతామసజ్ఞానములు

సీ. జగతి భిన్నము లైన సర్వభూతములందు
నాశంబు లేని భిన్నంబుగాని
యాత్మ నొక్కనిఁగాఁగ నరయు నాతనిపరి
జ్ఞానంబు సాత్త్వికజ్ఞాన మందు
రఖిలభూతంబులయందుఁ బృథగ్భావ
మునఁ జేసి వేర్వేర మొనసి భిన్న
రూపంబు లనుచు నిరూపించు నప్పురి
జ్ఞానంబు రాజసజ్ఞాన మంద్రు
తే. రాజనందన యొక్కకార్యంబునందు
సక్తమై యల్పమై హేతుసంయుతంబు
గాక నిల్కడ లేక నిక్కంబుగాక
తానె యన్ని యై నట్లుండు తామసంబు. 420

పైవారి త్రివిధకర్మములు.

సీ. కామరోషంబులు కడఁద్రోచి సంగంబు
విడిచి ఫలస్పృహఁ గడువఁ బెట్టి
నియతిచేఁ గావించు నిత్యకర్మం బెద్ది
గల దది సాత్త్వికకర్మ మంద్రు
ఫలకాంక్షియై యహంభావంబుతో బహు
ళాయాసముగఁ జేయునట్టి కర్మ

మది రాజసం బన నవనిలోఁ బేర్కొను
సరవి నాశంబు హింసయును బౌరు
తే. షంబు ననుబంధమును మదిఁ జర్చసేయ
కవని నజ్ఞానమునఁ జేయునట్టి నీచ
కర్మ మది ధాత్రిఁ దామసకర్మ మనుచుఁ
బల్కుదురు పెద్ద లగువారు పాండుతనయ. 421

త్రివిధకర్తలు

క. అనహంవాది యసంగుఁడు
ఘనధైర్యోత్సాహయుతుఁడు ఘనుఁ డవికారుం
డును సిద్ధ్యసిద్ధులం దా
యన సాత్త్వికకర్త యనఁగ నలరుఁ గిరీటీ. 422
క. అనురాగిఫలాసక్తుం
డును లుబ్ధుం డపరిశుద్ధుఁడును హింసాత్మ్కుం
డును శోకహర్షయుతుఁడును
విను రాజసకర్త యనఁగ విశ్రుతిఁగాంచున్. 423
గీ. పరుల కవమాన మొనరించు ప్రాకృతుండు
స్తబ్ధుఁడును మందమతియు విషాదిశఠుఁడు
నలసుఁడు నయుక్తసంచారుఁ డైనవాఁడు
గణుతి కెక్కును దామసకర్త యనఁగ. 424

సాత్త్వికరాజసతామసబుద్ధులు

వ. మరియు బుద్ధిభేదంబును ధైర్యభేదంబును గుణత్రయ విభాగంబువలనఁ ద్రివిధంబుగాఁ జెప్పంబడియె వాని నంతయు వేర్వేర నెఱింగించెద వినుము ప్రవృత్తి నివృత్తులను భయాభయంబులను గార్యాకార్యంబులను

బంధమోక్షంబుల నెయ్యది యెఱుంగు నది సాత్త్వికబుద్ధి యనం బరఁగు ధర్మాధర్మంబులను జేయందగినదానిఁ జేయం దగనిదాని యథార్థంబుగా నెయ్యది యెఱుంగం జాల దది రాజసబుద్ధి యనంబడు నజ్ఞానపరిచ్ఛిన్నంబై ధర్మంబు నధర్మంబుగా సర్వార్థంబులు విపర్యయంబులుగా నెయ్యది దలంచు నది తామసబుద్ధి యనంబడు యోగంబుచేత

త్రివిధధైర్యములు

నిరోధింపఁబడిన సంకల్పాదిమనఃక్రియలును జలనాది ప్రాణక్రియలును శ్రవణాదికరణక్రియలు నెయ్యది ధరించి యుండు నది సాత్త్వికధైర్యంబు మిక్కిలి యాసక్తి గలిగి ఫలంబు కోరి ధర్మార్థకామంబుల నెయ్యది ధరించు నది రాజసధైర్యంబు మరియు దుర్మేధుం డగు నరుం డెద్దానిచేత స్వప్నంబును భయంబును శోకంబును విషాదంబును మదంబును విడువ కుండు నట్టిధైర్యబు తామసధైర్యం బగుఁ బాండవోత్తమా నీకు బుద్ధిధైర్యంబుల త్రైవిధ్యం బుపదేశించితిఁ గదా యింక నేసుఖానుభవంబునందు నిరంతరాభ్యాసంబునం గ్రీడింపుచుండు నెయ్యది దుఃఖనాశంబు గావించు నట్టి సుఖంబు నెఱిఁగించెద నదియును ద్రివిధంబై యుండుఁ దత్ప్రకారంబు వినుము, 425

త్రివిధసుఖములు

సీ. ఆరంభకాలంబునందు విషము రీతిఁ
గనుపట్టి పరిణామకాలమందు
నమృతోపమానమై యాత్మబుద్ధిప్రకాశక
మైనసుఖము సాత్త్వికసుఖ మగుఁ

గరణార్థకరణయోగంబున నారంభ
కాలమం దమృతమై గానుపించి
పరిపాకకాలమం దురువిషంబై తోఁచు
సుఖ మొప్పు రాజససుఖ మనంగ

గీ. మరియు నిద్రాలసత్వప్రమాదములను
బొడమి యనుబంధమందును మొదల మిగులఁ
దనకు మోహానమై యెద్ది దనరు నట్టి
సుఖము తామససుఖ మగు సూరివినుత. 426

గీ. పాండునందన ప్రకృతిసంభవములైన
యట్టి యీమూఁడుగుణముల నాశ్రయించి
యుండు సర్వంబు త్రిగుణసముజ్ఝిత మగు
సత్వ మేదియు లే దెల్లజగములందు. 427

బ్రాహ్మణాదివర్ణస్వభావ కర్మగుణములు

గీ. వసుధలో బ్రాహ్మణక్షత్రవైశ్యశూద్ర
జాతులకును స్వభావసంజనితము లగు
నట్టిగుణములచేతనే యఖిలకర్మ
ములు విభాగింపఁ బడి యుండు నలఘుచరిత. 428

గీ. అంతరింద్రియనిగ్రహ మార్జవంబు
దమము శౌచంబు క్షాంతియుఁ దపము మరియు
జ్ఞానవిజ్ఞానములు నాస్తికత్వ మిది జ
గమున ద్విజులకు నైసర్గకర్మ మనఘ. 429

క. విను పార్థ ధృతియుఁ దేజం
బును దాక్ష్యము దానశౌర్యములు నని భీతిఁ

జనకుండుట ప్రభుశక్తియు
ఘననృపతుల కిది స్వభావకర్మము సుమ్మీ. 430

క. అరయంగ వైశ్యులకు ను
ర్వర గోరక్షణము కృషియు వాణిజ్యంబుల్
బరువడి నిసర్గకర్మము
పరిచర్యయు శూద్రులకు స్వభావము పార్థా. 431

క. క్షితిలో స్వకర్మమం దభి
రతుఁ డగుమనుజునకు సిద్ధి గ్రక్కునఁ గలుగున్
హితమతి స్వకర్మరతుఁ డే
గతి సిద్ధిని బడయుదానిఁ గఱపెద వినుమా. 432

—స్వధర్మంబునఁ దరించు ననుట—

గీ. పొసఁగ నెవ్వానివలన నీభూతసృష్టి
యొసఁగుచుండు నెవ్వానిచే నీయఖిలము
విస్తరింపంగఁబడు నట్టివిభుని నైజ
కర్మమునఁ గొల్చి సంసిద్ధిఁ గాంచు నరుఁడు. 433

వ. ధనంజయా గుణయుక్తం బైనయన్యధర్మంబుకంటె గుణహీనం బైనను స్వధర్మంబు శ్రేష్ఠంబై యుండు స్వధర్మానుష్ఠానంబు సేయువాఁడు పాపంబు నొందఁడు స్వభావంబైనకర్మంబు దోషసహితం బయినను దాని విడువం దగదు ధూమంబుచేత వహ్నియుం బోలె సమస్తకర్మంబులు దోషంబుచేత నాచ్ఛాదింపంబడి యుండు నెందునుం దగులుపడనిమనుజుండు విగతరాగుండై విజితాంతఃకరణుండై కర్మఫలత్యాగంబునఁ బరమోత్కృష్టం బయిన నిష్కర్మత్వసిద్ధి నొందు సిద్ధి నొందినవాఁడై పురుషుం డెట్లు బ్రహ్మంబు నొందు నట్టి సర్వోత్కృష్టంబయిన జ్ఞాననిష్ఠ నుపదేశించెద వినుము. 434

—జ్ఞాననిష్ఠ—

సీ. భువిలోనఁ బరిశుద్ధబుద్ధి సమేతుఁడై
ధృతిచేతఁ జిత్తంబుఁ దిగిచిపట్టి
విడువక శబ్దాదివిషయంబులను మాని
కామద్వేషంబులు కడకుఁ ద్రోచి
విజన దేశంబు సేవింపుచు లఘుభోజ
నంబు సేయుచును మనశ్శరీర
వాక్కుల నియమించి వైరాగ్యమును బొంది
సతత మాత్మ ధ్యానసహితుఁ డగుచు

గీ. బల మహంకృతికామదర్పములు విడిచి
క్రోధము పరిగ్రహంబును గోఁటతపఱచి
నిర్మలుండై నశాంతుండు నిత్యమైన
బ్రహ్మపదమును బ్రాపించుఁ బాండవేయ. 435

క. పరికింప బ్రహ్మభూతుఁడు
సరసుఁడు విమలాత్మకుండు సర్వసముఁడునై
ధర శోకింపక కోరక
పర మగుమద్భక్తి నొందుఁ బాండుకుమారా. 436

గీ. పృథివి నే నెట్టివాఁడనొ యెంతవాఁడ
నో యథార్థముగా నన్నుఁ బాయ కెవ్వఁ
డెఱుఁగు నాతఁ డీరీతి న న్నెఱిఁగి యపల
నను యథార్థముగాఁబొందు నయచరిత్ర. 437

సీ. విను మదాశ్రయుఁడైనట్టి మనుజవరుఁ
డవనిలో సర్వకర్మంబు లనవరతము

తవిలి సేయుచు మత్ప్రసాదంబువలన
శాశ్వతం బగు నవ్యయస్థాన మొందు. 438

క. అనఘాత్మ మత్పరుఁడవై
యొనరించినకర్మ మెల్ల నొప్పఁగ నాయం
దునిచి మతియోగముం గై
కొని మచ్చిత్తుఁడవు గమ్ము కురుకులవర్యా. 439

గీ. అనఘచరిత మచ్చిత్తుండ వైతి వేని
మత్ప్రసాదంబువలన సమస్తదుఃఖ
వితతి దాఁటెద వటుగాక వినక యున్న
నిరయగతి కేగెదవు నీవు నిక్క మింత. 440

చ. అనుపమబుద్ధి నీవు దురహంకృతి నొంది రణంబు సేయ నే
ననుచుఁ దలంచితేని సుగుణాకర నీవ్యవసాయ మంతయుఁ
మునుకొని వ్యర్థమై చను సముద్ధతి నాదు దురంతమాయ ని
న్ననిశముఁ జేయఁగాఁ బనుచు నవ్వల నైన నొనర్చె దర్జునా.

చ. భరతకులప్రదీపక స్వభావసముద్భవనైజకర్మమం
దరువుగ నిల్చి నాకఱపి నట్లువివేకితఁ జేయవేని సొం
పఱియవశుండవై యవల నైన నొనర్చెద వెట్టులైన సు
స్థిరమతి యుద్ధకార్య మది సేయక తీరదు నీకు ఫల్గునా. 442

మ. తనురూపంబున నీశ్వరుం డఖిలభూతస్వాంతదేశస్థుఁడై [లన్
యనిశంబున్ దన మాయచే నిఖిలయంత్రారూఢభూతంబు
బనిగాఁ జిక్కులఁ బెట్టు సర్వగతులన్ భావింపు మద్దేవునిన్
వినుమీవొందెదుతత్కృపన్ బరమశాంతిన్ శాశ్వతస్థానమున్.

చ. అతులితమై రహస్యములయందలి చాల రహస్య మైనయీ
వితతవివేక మేను గడువిశ్రుతభంగి నెఱుంగఁ బల్కితిన్

జితవిమతా మనంబున న శేషము చింతన మాచరించి నీ
మతి కెటుదోఁచె నప్పగిది మానక సేయుము వేయు నేటికిన్.

పరమరహస్యము

వ. ఇంక నొక్క పరమరహస్యంబు గలదు నా కభిమతుండ
వగుటంజేసి దాని నీకెఱింగించెద సమాహితచిత్తుండవై
యాకర్ణింపుము. 445

చ. కలఁగక నాకు భక్తుఁడవు గమ్మిఁక నాపయిఁ జేర్పు చిత్తముం
జెలువుగ నాకుఁ బూజనము సేయుము నాకు నమస్కరింపుమిం
పలరఁగ నాకు సమ్మతుఁడ వైతివి నీ విటు సేసితేని ని [దన్.
శ్చలముగ నన్నె పొందెదవు సత్యముగాఁగఁ బ్రతిజ్ఞఁ జేసె

గీ. సర్వ ధర్మములను జయ్యన విడిచి న
న్నొకని భక్తి శరణ మొందు మీవు
కరుణ నిన్ను సర్వకలుషవిముక్తునిఁ
జేసి కాతుఁ జింత సేయవలదు. 447

ఇట్టిదుర్బుద్ధి కీశాస్త్రం బుపదేశింపఁగూడదనుట

చ. సరసగుణాఢ్య నీ కిపుడు సత్కృపఁ జెప్పిన శాస్త్ర ముర్విలోఁ
బరమతపంబు జ్ఞానమును భక్తియు భావన లేనివానికిన్
వెఱవక నాపయిన్ బ్రియము వీడి యసూయ యొనర్చు
నిరుపమబుద్ధితోడవిన నేరనివారికిఁ దెల్పరాదొగిన్. [వానికిన్

సుబుద్ధి కుపదేశించువానిఫలము

చ. గురుతరబుద్ధి నెవ్వఁ డతిగుహ్యము నద్భుత మైనదీని సు
స్థిరముగ నాదుభక్తులకుఁ జెప్పుచుఁ దా సతతంబు నాపయిన్
దిరుగనిభక్తిఁ జేర్చి కడు ధీరత వర్తిలు నట్టిపుణ్యుఁడున్
బరువడి నన్నె పొందు కుది వల్వదు సంధియ మింద్రనందనా.

చ. నలువుగ వానికంటె భువనంబులయం దటునాకుసత్ప్రియం
బలవడఁ జేయునట్టివరుఁ డన్యుఁడు వేఱొకరుండు లేఁడుపొం
పలరఁగ వానికంటెమరియన్యుఁడునాకుఁ బ్రియుండు లేఁడుపో
పలుమరువాఁడెసత్ప్రియుఁడువాఁడెమహాప్రియకారినాకిలన్.

శాస్త్రఫలశ్రుతి

మ. చతురత్వంబున ధర్మ్యమైన మనయీ సంవాద మేపుణ్యుఁడా
తతభక్తిన్ బఠియించు నన్నరుని చేతన్ జ్ఞానయజ్ఞంబుచే
సతతంబున్ గడుఁబూజితుండనగుదున్ సత్యంబునాకెంతయున్
నతవైరీ విను మింతకంటె మత మన్యం బెద్ది లే దారయన్.

క. విను శ్రద్ధావంతుండై
యనసూయకుఁ డగుచు నెవ్వఁ డనిశము దీనిన్
వినువాఁడు ముక్తుఁడై గో
బ్బునఁ బుణ్యులభవ్యలోకములు ప్రాపించున్. 452

వ. అని యిట్లు వాసుదేవుండు సర్వోపనిషదర్థప్రతిపాదకం
బైనమోక్షయోగం బుపదేశించి వెండియు నర్జునుం జూచి.

గీ. కరుణ నాచెప్పినట్టి యీ జ్ఞాన మంత
మొనసి నీచేత నేకాగ్రబుద్ధిచేత
వినఁబడెనె మోహమంతయు విడువఁబడెనె
పొడుకొనినయజ్ఞానంబు వాసి చనెనె. 454

చ. అని యిటు కృష్ణుఁ డాడిన నయంబునఁ గ్రమ్మఱఁ బల్కె
నర్జునుం, డనఘ భవత్ప్రసాదమున నజ్ఞతయున్ జనె వీడె
మోహమున్, బనివడి సంశయంబు లవి పాసెను
సంస్మరణంబు నొందితిన్, మునుకొని నీదు వాక్య మింక
ముఖ్యముగాఁ గొని యాచరించెదన్. 455

వ. అని పల్కి యర్జునుండు సంగ్రామోద్యుక్తుం డయ్యె నని
చెప్పి సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 456

మ. జననాథోత్తమ కృష్ణ ఫల్గునులయీసంవాద మత్యంతపా
వనమాశ్చర్యముగుహ్యముం బరమునై భాసిల్లునీయోగము
య్యన యోగేశ్వరుఁడైన కృష్ణువలనన్ వ్యాసప్రసాదంబుచే
విని సమ్మోదమునొందితిన్ గడునిరుద్వేగుండనై తిన్ రహిన్.

క. హరిపార్థులసంవాదము
తరుచుగఁ జిత్తంబులోనఁ దలఁచి తలఁచి నే
నరుదార సారెసారెకుఁ
బరమానందమున నున్నవాఁడ నృపాలా. 458

క. పరమాశ్చర్యకరంబగు
హరిరూపముఁ జూచి చూచి యచ్చెరువడి నే
నరుదార మాటిమాటికిఁ
బరమామోదమున నున్నవాఁడ నృపాలా. 459

గీ. పృథివి యోగేశ్వరుం డైనకృష్ణమూర్తి
పృథుధనుర్ధరుఁడైనకిరీటి యెచట
నుండు రచ్చటఁ దరలక యుండు. విజయ
భూతి నీతి సంపద లిది నాతలంపు. 460

శా. శ్రీవెల్లోటికుమారయాచధరణీశీతాంశుఁ డధ్యాత్మవి
ద్యావిచ్ఛ్రేష్ఠుఁడు గోపినాథకులజుం డౌ వేంకటాఖ్యార్యుచే
దైవానుగ్రహలబ్ధిహేతు వగుగీతాశాస్త్ర ముర్విజనుల్
సేవింపం దగుగద్యపద్యములుగాఁ జేయించె నుద్యన్మతిన్.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951